# తండ్రి కొడుకులు

(Egor Bulichoff and others)

(మాక్సిం గోర్కీ)

అనువాదకులు:

ఉన్నవ లక్ష్మీనారాయణ,
చిట్టూరి సత్యనారాయణ.

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ.

# పాత్రలు :

| | | |
|---|---|---|
| 1 ఈగర్ | .... | ఒక షాహుంకారు |
| 2 షూరా | .... | అతని కుమార్తె |
| 3 జీనియా | .... | అతని భార్య |
| 4 వార్వరా | .... | జీనియా కుమార్తె |
| 5 స్వ్యాంట్జాఫ్ | .... | వార్వరా భర్త |
| 6 మెలీనియా | ... | జీనియా సోదరి |
| 7 బయాటిన్ | .... | స్వ్యాంట్జాఫ్ బంధువు |
| 8 బాష్కిన్ | .... | బురిషాఫ్ ఏజంటు |
| 9 దోస్టిగేఫ్ | .... | మరియొక షాహుంకారు |
| 10 ఎలయిజవేటా | ... | దోస్టిగేఫ్ భార్య |
| 11 ఆంటోనియా | .... | దోస్టిగేఫ్ ప్రథమ భార్య |
| 12 అలెగ్జి | | సంతానము |
| 13 పావ్లిన్ | .... | పాదిరీ |
| 14 గేబ్రియల్ | .... | డాకా వైద్యుడు |
| 15 సోప్యానా | .... | మంత్రకత్తె |
| 16 ప్రొపోతేజ్ | . | భక్తుడు |
| 17 గ్లాషా | .... | పనికత్తె |
| 18 హైసియా | .... | మెలీనియా శిష్యురాలు |
| 19 యాకౌ లాప్టీవ్ | .. | బురిషాఫ్ పెంపుడుకొడుకు |
| 20 మొక్రౌజవ్ | . | పోలీసు |
| 21 డోనాట్ | .... | కాపలా మనిషి |

# తుది ఘడియలు



[బులిషాఫ్ యింట్లో గది. కిటికీల తెరలగుండా మసకగా సూర్య కాంతి గదిలో పడుతోంది. అక్కడి సామాను వికృతంగా వుంటుంది. నగిషీ చెక్కిన టేబిలు, తోలుతో మూసిన కుర్చీలు, రకరకాల బొమ్మలూ, చిల్లరి సామాన్లూ వుంటై. కుడివైపు గోడకున్న గుమ్మము హాలులోకుంది హాల్లోగుండా మేడ మెట్లు, పై గది కొంత భాగం కన్పిస్తుంటై. వెనుక నున్న గుమ్మం వంటగదికి, తోటలోకి దారి చూపెడుతుంది. ఇంటిలోవి పొయ్యి కెదురుగా బులిషాఫ్ భార్య కుట్టుపనిలో లీనమై వుంటుంది. కిటికీపక్క గ్లాషా ఏవో పుష్పాలు సర్దుతూ వుంటుంది. మేడ మెట్లమీది నుంచి షూరా డ్రస్సింగు గౌను, స్లిప్పర్లు వేసికొని దిగి వస్తూంటుంది. రాగిరంగు జుట్టు భుజాలమీద విరబోసి వుంటుంది. ఆమె అచ్చంగా టైగర్‌లాగే వుంటుంది.]

జీనియా: ఇప్పుడా నిదుర లేచింది! పదకొండు కావస్తోంది తెలుసా?

షూరా: (విసుక్కొంటూ) తెల్లవారిందీ వుపన్యాసానికి? గ్లాషా: కొంచెం కాఫీ! పేపరెక్కడ?

గ్లాషా: పైన వార్వారా దగ్గరుంది.

షూరా: ఊఁ హుఁ. బాగానేవుంది. మరిపోయితీసుకురా. వార్వారా ఎప్పుడూ పేపర్ తనదగ్గరే పెట్టుకూర్చుంటుంది. ఇంట్లోఅందరికీ ఒక్కటేపేపరైనప్పుడు తనవద్దే వుంచుకుంటేఎల్లా (కుడివైపుననున్న టెలిఫోన్ దగ్గరకు వెళుతూ) ఇకచాలు. ఆభార్యా భర్తలు ఇది తమయిల్లు

కాదనుకొని ప్రవర్తిస్తే బాగుంటుంది. నాన్నగారు యింట్లో వున్నారా?

జీనియా: గాయపడ్డవాళ్ళని చూడ్డానికివెళ్లారు.

షూరా: (ఫోన్‌లో) హల్లో! 1763 కావాలి.

జీనియా: హుం, నాకేమి అర్ధ మవడంలా యీ యింటివరస.

షూరా: హల్లో! నువ్వేనా టోనియా! మంచుమీద జారుడాటకు పోదామా? రావూ! ఏం? నాటకానికి పోతావా? రానని చెప్పరాదూ. ఓహో - అదాకారణం! ఓసిబాలవిధవా! అల్లా చెప్పరాదూ! సరే(రిసీవరు బల్లమీదపెట్టేస్తుంది.)

జీనియా: ఏమి టా అమ్మాయిని విధవా అనేస్తున్నావ్!

షూరా: అవునుమరి, ఆమె వయసు చచ్చాడుగా?

జీనియా: పెళ్లికాలేదుగా. కనుక ఆ అమ్మాయి కన్యే.

షూరా: కన్యో కాదో నీకేం తెలుసు?

జీనియా: ఓసి సిగ్గుమాలిన భడవా!

గ్లాషా: (కాఫీతెచ్చి అందిస్తూ) వార్వరా తనే పేపరు తీసుకు వస్తానంది.

జీనియా: ఒట్టి ముదినాపసాని మాటలు! జాగ్రత్త. ఇల్లాంటి విషయాలు యెంత తక్కువ తెలిస్తే అంతబాగా నిద్ర పడుతుంది. నీ వయస్సులో వుండగా నా కల్లాంటి సంగతులేవీ తెలియవమ్మా!

షూరా: నీ కప్పు డెంత తెలుసో యిప్పుడూ అంతే తెలుసు.

జీనియా: (వింతగా) ఏమిటి!

షూరా: అదిగో, అక్కయ్యగారు గంభీర వదనంతో వేంచేస్తు న్నారు. ఏమండోయ్ మహారాణీగారూ! బహుపరాక్!! స్వాగతం! సుస్వాగతం!!

వార్వరా: (మెట్లుదిగివస్తూ) అప్పుడే పదకొండు గంటలయింది. ఇంకా బట్టలైనా వేసుకోలేదు. అరె, తలకూడ దువ్వు కోలేదే!

షూరా: మొదలెట్టిందిరా బాబూ సాధింపు.

వార్వరా: నాన్నగారిచ్చిన చనువు కొద్దీ నువ్వు లాభంపొందడమే కాకుండా, ఆయనకు జబ్బుచేసి నప్పటినుంచి సోమరిగా తిరగడం ప్రారంభించావు.

షూరా: ఊఁ, కానివ్వండి మీ వుపన్యాసం యింకెంతుందో.

జీనియా: వాళ్లనాన్న ఆరోగ్యమెల్లావుంటే ఆవిడకేఁ?

వార్వరా: నేను నీప్రవర్తనను గురించి నాన్నగారితో మాట్లాడుతాన్లే.

షూరా: మంచిది; చాలామంచిది. సరే, ఇప్పటికిక పూర్తయి నట్టేనా? నేను శాంతంగా కాఫీ అయినా తాగొచ్చు.

వార్వరా: ఓసి మొద్దూ!............(గ్లాషాలోపలికి వస్తుంది.)

షూరా: (వేళాకోళంగా) తమ ప్రతాపం నౌకర్లముందుకూడా చూపాలీ?

వార్వరా: అమ్మా! వంటవాడి నడిగావూ నేనుచెప్పిన సంగతి? మళ్లీ పొద్దుటి భోజనంకూడ చల్లబడి పోయింది.

జీనియా: వాడిమతి మతిలో లేదమ్మా! పాపం, యిందాక వుత్త రంవచ్చింది వాడికొడుకుని చంపేశారని.

వార్వరా; అంచేత నాకు చల్లారిన అన్నం పెడతావా? నీకుచేత కాకపోతే నేనే అడుగుతానుండు. (వెళ్లిపోతుంది.)

జీనియా: వార్వరా! (పిలుస్తూ కూతురు వెనకాలె వెళ్తుంది.)

షూరా: తన పిృియ స్నేహితురాలు ఆంద్రియాషాను యేదైనా ముంచుకొచ్చినప్పుడు ఈబిడ తడబడకుండా వుంటుం దేమొ చూడాలి.

గ్లాషా: ఎందుకమ్మా, వాళ్లనలా వేపుకు తినడం? నువ్వు శాస్త్ర జాగ్రితగా వుండాలి. కాఫీకప్పు తీసుకొని వెళ్లిపో తుంది.

[మూరా పడక్కుర్చీలో చేరగిలబడి ఒక క్షణం కళ్లు మూసుకుంటుంది. స్ప్యాట్జాఫ్ మెత్తని చెప్పులతో చప్పుడు కాకుండా మెట్లుదిగి షూరా వెనగ్గా వచ్చి ఆమె మెడకు చేతులు చుట్టవేస్తాడు.]

స్ప్యాంట్జాఫ్; ఏమి కలగంటున్నారు గయ్యాళిగంప గారూ?

షూరా: (కదలకుండా తల తిప్పకుండానే) ఫో అవతలికి.

స్ప్యాంట్జాఫ్; నటించొద్దు. ఆ నాటకం నాకు నచ్చదు. పోనీ నీకిష్టం లేదంటావా? నిజంచెప్పు.

షూరా: లేదు. నన్నొంటరిగా వుండనిద్దూ. నిన్నునేను రవంతైనా ఆకర్షించడంలేదు నిజానికి.

స్ప్యాంట్జాఫ్: (ముద్దు పెట్టుకొని) పోనీ యిది యిష్టమేనా నీకు? యిదీహావా?

షూరా ఉః హుంః. ఇదంతా వర్వరాకు తెలిస్తే.............
(వార్వరా వంటింట్లోనుంచి తిరిగి వస్తుంది.)

స్వాంట్జాఫ్: (షూరాకి యెదంగా పోతూ) ఔను; మీరు జతగానే శ్రమ పడాలి. మీరు బాగా చదవాలి అంటే....

వార్వరా: ఆమె కా ద్రస్సింగు గౌనులోనే రోజంతా సోమరిగా పడి వుండడం యిష్టం. లేకపోతే అంటోనియాతో వృధాగా కాలం గడిపెయ్యడం!

షూరా: నేను నా కాలాన్ని యిష్ట మొచ్చినట్టు గడుపుకోటాని క్కూడ నీ యీ సణుగు డేమిటి?

వార్వరా: నేను చెపుతున్నది నీ మంచికోసమే. ఎంత కేదైనా ఒక నాటికి నీ భుక్తికోసం నువ్వు తంటాలు పడాల్సి వస్తుంది.

షూరా: నువ్వు నీ గొడవ మాత్రమే చూచుకొని నా సంగతి వదిలేస్తే గదా!

స్వాంట్జాఫ్: (తడబడుతూ) నేను, ఉః, మేము ఆమె భావిని గురించే మాట్లాడుతున్నాము వర్వరా! ఆమె సంగీతం నేర్చుకుందామనుకొంటోంది.

షూరా: (కుడి వైపు ద్వారంలోనుంచి వెళ్ళిపోతూ) నేను సంగీతం నేర్చుకోవా లనుకోటంలా.

వార్వరా: ఆవిడ సంగీతం నేర్చుకోవటమా? ఏమి టిదంతా?

స్వాంట్జాఫ్: మేము మాట్లాడుతున్నాం. ఆః-ఆమెని....ఆః నే నలా

అర్థం చేసుకుంటున్నాను. నే నూహించింది కాదు. ఊహించానంటావా? నువ్వామె విషయంలో చాలా కఠినంగా వున్నావు.

వార్వరా: మిమ్మల్ని ఎవరూ అనలేరే వూహించారని.

స్వ్యాంట్జాఫ్: ఇదిగో ప్రియా! ఇదిగో. నువ్వలా అనకూడదు. అలా చెప్పటానికి....

వార్వరా: నేనేమీ చెప్పటా మనుకోలా. నువ్వు మేడమీదినుంచి దిగి వచ్చా వెందుకు?

స్వ్యాంట్జాఫ్: కాపలా వాళ్లు ఎలుగును తరుముతున్నారని చూడ్డానికి వచ్చా.

వార్వరా: డోనాట్ వంటింటిలో వున్నాడు.

స్వ్యాంట్జాఫ్: నే నక్కడికే వెళ్తూ వెళ్తూ పేపరు చూద్దామని ఆగాను.

వార్వరా: మరి మీరు షూరాతో సంగీతాన్ని గూర్చి మాట్లాడుతున్నట్టు చెప్పారే యిందాక?

స్వ్యాంట్జాఫ్: న న్నీవిధంగా యెదురు ప్రశ్నలు అడగొద్దు. స్కూలు పిల్లాడి ననుకొన్నట్టుగా నాతో మాటాడుతుంటావు. (బయట చప్పుడవుతుంది. షూరా తండ్రి చెయి పుచ్చుకొని అతని వెనకాలే వస్తుంది. పావ్లిన్ కూడా వస్తాడు.)

స్వ్యాంట్జాఫ్: గుడ్ మార్నింగ్, ఈగర్! నే నిప్పుడే కాపలా వాళ్ళని గురించి వార్వరాతో మాట్లాడుతున్నాను. డోనాట్ మీ

కోసం వంటిటిలో యెదురు చూస్తున్నట్టు వార్వరా యిప్పుడే చెప్పింది.

వార్వరా: నేను మీతో అలాంటి దేమీ చెప్పలా. (వెళ్ళిపో తుంది.)

స్వాంట్జాఫ్: నిజంగా నా కిప్పుడే యెవరో చెప్పారు మీ కోసం అత దెదురు చూస్తున్నాడని. మీ రిక్క డున్నారని నే నతనితో చెపుతాను. (వెళ్తాడు.)
(చేతులున్న కుర్చీలో ఈగర్ కూర్చొని ఒక చేతితో మూరా నడుమును చుట్టవేస్తాడు. ఆమె అతని జుట్టును వ్రేళ్ళతో పాయలు తీస్తూంటుంది.)

ఈగర్: కూర్చోండి మహాశయా! (పాల్లిన్ కూర్చుంటాడు.) తమ కేంగావాలి? ఇవాళ పుదయాన్నుంచి నాకు చాల చింతగా వుంది. వాళ్ళు చాలా మందిని చంపివేశారు. ఓ! తలుచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తోంది. అది మహా భయంకరం. అందువల్ల ఏమిటి లాభం? అస లేమైనా ప్రయోజన ముంటుందా? ఇంతవరకు మన కున్న కష్టాలు చాలనట్టు........అయినా మనం అసలు వాళ్ళతో కలవాల్సింది కాదు.

పాల్లిన్: అది మన నెత్తిమీదొచ్చి పడింది. దేశంకోసమూ, జార్ యొక్క గౌరవం నిలబెట్టే నిమిత్తమూ మనం యెదిరించి తీరాలి.

ఈగర్: మన దేశ గౌరవమా! జపాన్‌తో జరిగిన మొన్నటి ఆఖరు యుద్ధంలో మన మా విషయాన్ని గురించి ఆలోచించి వుండాల్సింది. మీ రనే ఆ గౌరవం యిప్పుడు మాత్రం ఏం మిగిలింది?

హాప్లిన్: మీరు కొంచెం బాగును గూర్చి కూడా యోచించాలి. ఇప్పు డీ యుద్ధమంటే చాలామందికి ధనమూ-ఐశ్వర్యం కూడాను.

ఈగర్: యుద్ధాలన్నీ సమానమే. కొందరు యుద్ధం చేస్తారు. మరికొందరు దోచుకొంటారు. వందలాద్దీ చస్తారు. వేలమంది వికలాంగులై వచ్చినవాళ్ళే మెరుగనేలా తయారవుతారు. అయినా మీ రేమిటో ఇంకా బాగును గూర్చి ఆలోచించాలంటారు.

హాప్లిన్: అవి మన చేతుల్లో యేముంది? మన యుద్దరి శక్తికి మించిన దా పని.

ఈగర్: ఇప్పు డైతే మీరు చెప్పే వేదవాక్యాలు మా షూరాకి నచ్చవు. (షూరాతో) నువ్వు మంచులో షికారుకు వెళతాననుకున్నానే?

షూరా: నేను తయారే. కాని, బోసియా రావడంలా.

ఈగర్: బయటికి పోయి బాగా గాలి పోసుకురా. ఊఁ, వెళ్లు. (షూరా తొందరగా వెళ్ళిపోతుంది.)

పాల్లిన్: రోజు రోజుకి ఈమె సౌందర్యం వికసిస్తోంది.

ఈగర్: చక్కని విగ్రహం. గోగులా పొదగరి. మొత్తంమీద అందమైనదనే చెప్పాలి. ఆమె తల్లికి రెండూ లేవు; కాని, అఖండమైన తెలివి. అంతటి తెలివితేట లుండటం ఆశ్చర్యమే! అయితే అందం మాత్రం శూన్యం.

పాల్లిన్: మీ రామె తల్లిని గూర్చి ఎప్పుడూ మాట్లాడరే?

ఈగర్: ఆమె సైబీరియా నుంచి వచ్చింది. మీ రామెను చూచే వుంటారు. కాని, మీ రిక్కడికి వచ్చింది షూరా కోసం. జార్‌ను గురించి కాదు.

పాల్లిన్: జార్! చర్చి సేవకుడి కిల్లాంటి విషయాల్లో జోక్యం పెట్టుకోవడం భావ్యం కాదు; కాని, యీ రోజుల్లో ప్రతి వ్యక్తిలోను దేశభక్తి నుద్దీపింప జేయటం చర్చి సేవకుడికి విధి.

ఈగర్: నిరపరాధులగు జనాన్ని గొత్తెల మందలా కబేళాకి పంపడమేగా ఆ విధి! బలే బాగు!

పాల్లిన్: నే నన్నది చర్చి విషయం. వార్డన్‌తో చెప్పి చర్చిలోని గాయక బృందాన్ని ఎక్కువ చేసేటట్టు చేశాను. కొత్త గంటలు కావాల్సి వచ్చాయి. జనరల్ బెట్లింగ్‌ను కూడ సందర్శించాను. మీ ఆరోగ్యం కోసమైనా

భగవత్కార్యం కనుక యేమైనా చందా యిప్పిస్తే మంచిది.

ఈగర్: చర్చిలో గంటలు నా రోగాన్ని కుదుర్చుతాయా?

పాల్లిన్: ఎవరు చెప్పగలరు? సైన్సు విజ్ఞానం యొక్క పై అంచుల్ని పట్టుకొని ప్రాకులాడుతుంది. జర్మనీలో చాలా వ్యాధులకు సంగీతాన్ని మందుగా వుపయోగించడాన్ని గురించి నేను విన్నాను. ఈ ప్రక్క గ్రామంలో ఒక రైతు బాకా ఊది యే రోగాన్నైనా పోగొట్ట గలనని ధీమాగా చెబుతున్నాడు.

ఈగర్: ఎలాంటి దేమిటి ఆ బాకా?

పాల్లిన్: ఒక పెద్ద ఇత్తడి బాకా. నేనైతే అతణ్ని చూళ్లేదు; కాని, అతను ఎవరికీ లొంగని అనేక రోగాలను నయం చేశాడని చాలామంది చెబుతున్నారు.

ఈగర్: చాలా పెద్ద బాకా అయితే బలే మంచిది.

పాల్లిన్: మీరు నవ్వొచ్చు; కాని, అసాధ్యమైన దేదీ లేదు. అర్థం కాని అద్భుతాల మధ్య అజ్ఞానాంధకారంలో మన జీవితాలే ఒకరహస్యం. అటువంటప్పుడు యేదీ దుస్సాధ్యం కాదు. మనం వెల్తుర్ని చూస్తున్నా మను కుంటున్నాము. అది మన మెదడును మాత్రమే కది

లించవచ్చు. దానిలోని అంతరార్థం తార్కికంగా అంధకారమే.

ఈగర్: (ఉత్సుకతో) పాల్లిన్! మాటల్ని దొర్లించటమంటే యెంత ప్రేమండీ మీకు.

పాల్లిన్: (ఆవేశించిన ఉత్సాహంతో) ఇంతెందుకు? ఉదాహరణకి ప్రొపోతేజ్‌నే చూద్దాం. ఎంతమంది అతన్నిపిచ్చివాడనుకోరు? కాని, అతడు పొందే ఆనందం........

ఈగర్: నేను అలసిపోయాను. మీ రిక నన్ను క్షమించాలి.

పాల్లిన్: (లేస్తూ) వెయ్యి సార్లు మీరే క్షమించాలి. నేను చాలా విచారపడుతున్నాను.

ఈగర్: మరి సెలవు.

పాల్లిన్: గంటల మా టేమిటి? మీ వ్యాధి కుదరటానికి.....

ఈగర్: ఆ విషయం తరవాత మాట్లాడుకుందాము.

పాల్లిన్: మంచిది. సెలవు. మీ ఆరోగ్యంకోసం నేను నిత్యమూ దేవుణ్ణి ప్రార్థిస్తూంటాను. మీరు గంటల విషయం మాత్రం మరిచిపోకండి. (ఈగర్ అతనికి బయటకి దారి చూపి పంపించేస్తాడు.)

ఈగర్: (కుడిచేత్తో రొమ్ము నదుముకొని సోఫాలో కూచుని) గ్లాషా!

వార్వరా: (బయటకి పోటానికి తగిన దుస్తులతో మెట్లమీది నుంచి దిగుతూ) ఏం నాన్నా?

ఈగర్: ఏం లేదు. నేను పిల్చింది గ్లాషాని. నువ్విప్పుడు ముస్తాబయ్యావేమిటి?

వార్వరా: సాయంత్రం వికలాంగుల సహాయార్థం ధర్మ ప్రదర్శనం వుంది.

ఈగర్: ఆ కళ్ళతోడెందుకు? నీ కది అక్కర లేదే. ఫేషను కోసం కాబోలు! గ్లాషా యెక్కడుంది?

వార్వరా: నాన్నగారూ! మీ రొకసారి షూరాతో మాట్లాడాలి. ఆవిడ నడత యేమీ బాగుండలా. ఇవాళ వుదయం 11½ దాకా ఆమె దుస్తులే వేసుకోలేదు.

ఈగర్: నువ్విక వెళ్లు. నేను అలిసిపొయ్యాను. కాస్సేపు ఒంటరిగా వుండాలి.

వార్వరా: మంచిది, అలాగే. (కుడివైపు నుంచి పోతుంది.)

గ్లాషా: (ఎడమ ప్రక్కనుంచి వస్తూ) నన్ను పిల్చారా మీరు?

ఈగర్: అవును గ్లాషా! నువ్వు చాల అందంగా వుంటావు. పుష్టిగా ఆకర్షణీయంగా వున్నావు. వార్వరా ఒట్టి పీల మనిషి.

గ్లాషా: అదృష్టవంతురాలు. మీ కూతురు గనుక ఆమె మిమ్మల్ని వదిలి వుండదు.

ఈగర్: నేను చెప్పేదేమిటో తెలుసా నీకు?

గ్లాషా: ఆఁ. మరి షూరా? నాకు కళ్లు లేవనుకొన్నారా మీరు? మీరు మీచెయ్యి నామె నడుముచుట్టూ వేసికూర్చుంటే

చూట్టం లేదనుకున్నారా?

ఈగర్: అంచేత షూరాఅంటే నీకు అసూయ కదూ?

గ్లాషా: ఇంతకూ మీరు నన్ను పిల్చిం దెందుకు?

ఈగర్: ఇలా దగ్గరికిరా గ్లాషా! ఏదీ(అని ఆమె చెయ్యితీసు కొనిముద్దుపెట్టుకుంటాడు.) నేనంటే నీకుప్రేమే. అవు నా గ్లాషా? ఇట్లాజబ్బుగా వున్నాననే కదూ?

గ్లాషా: (అతన్ని కౌగలిస్తూ) మీరు బాగైపోవాలి. త్వరగా న యంచేసుకోవాలి.

(అంతలో యేదో చప్పుడవుతుంది. గ్లాషా పరుగున పోతుంది. ఈగర్ తలని వెనక కుర్చీమీద వాలుస్తాడు. దోనాట్ వంటింటిలోంచివస్తాడు.)

దోనాట్: తమకెట్లావుం దీవేళ?

ఈగర్: కొంచెం నయమే. న న్నడిగావ దెందుకు?

దోనాట్: మీకో మంచివార్త చెప్పాలని. వాళ్లొక ఎలుగుండే స్థావరాన్ని తెలుసుకొచ్చారు.

ఈగర్: మంచికబురే తెచ్చావు! కాని, ఇప్పట్లో ఎలుగును వేటాడ్డం సాధ్యంకాదు. అప్రదేశ మెటువేపు?

దోనాట్: కొండమీద.

ఈగర్: దారేర్పరుస్తున్నారా?

దోనాట్ చాలినంతమంది జనంలేరు. అంచేత పని సరిగా జరగ టం లేదు.

జీనియా: (ఎడమ వేపునుంచి ప్రవేశిస్తూ) ఈగర్! మీరు చాలా నీరసంగా వున్నారు. ఈ స్థితిలో వేట కెళ్లగూడదని యెరగరూ?

ఈగర్: నువ్వు మాట్లాడబోకు. (దోనాట్‌తో) తగినంతమంది తేరనా నువ్వనేది?

దోనాట్: ఊళ్లో మిగిలున్న వాళ్లల్లా చిన్నపిల్లలూ, ముసలివాళ్లూ ను. 50 మంది జర్మన్ ఖైదీలుకూడ వున్నారు; కాని, వాళ్లు అడవిలో కెళ్లరు.

ఈగర్: వాళ్లకి ఆడవాళ్లగిరాకీ బాగా తగిలి వుండాలి.

జీనియా: అప్పుడే వాళ్లకి వూళ్లో కొంచ రాడవాళ్లకీ స్నేహంకలిసి నట్టు పుకార్లుకూడ బయల్దేరినై.

ఈగర్: మరేం జరుగుతుందిలే! స్త్రీలు ఒంటరిగా వుండిపోయా రయ్యే.

జీనియా: ఇంతకంటె అవమాన ముందా?

దోనాట్: అందులో నా కేమి అపాయం కనపడ్డంలా. ఎవళ్లోఒక ళ్లు సంతానాభివృద్ధి చేయాల్సిందే. యుద్ధంవల్ల జనం నశిస్తేదానివల్లే మళ్లీ సృష్టి జరగాలి.
జీనియా: యుద్ధ ఖైదీ కండిగి గావమాన్ని గురించి భావించటమా!

ఈగర్: ఊఁ,ఏఁ? మనిషి ఆరోగ్యంగావుంటే తేడా యేముం

దేమిటి? ఇప్పు డింట్లలో వుండిపోయిన మగాళ్లకంటె వాళ్లే చాలానయం.

జీనియా: సరైన మగవాళ్లందరినీ యుద్ధం మింగేసింది. మిగిలున్న వాళ్లంతా కూచుని లేవలేనివాళ్లే.

ఈగర్: పూర్తి అయింతర్వాత ఏం జరుగుతుందో. మిగిలున్న వాళ్లస్థితి కాస్త బాగుపడుతుందేమో!

దోనాట్: జార్ల దురాశ తీరితేకదూ!

ఈగర్: ఏమిటి?

దోనాట్: రష్యా పూర్తిగా నాశనమైపోయేదాక వాళ్ల ఆశతీరదు. వాళ్లకు తృప్తిలేదు. మనం యుద్ధమెందుకు చేస్తున్నామో మనలో ఒక్కడికైనా తెలుసా? జార్ జయించటానికీ, మనం భరించటానికీని.

జీనియా: దోనాట్! నువ్వలా మాట్లాడకూడదు. నీకింకా తెలియదు. నువ్వు బాగా తెలుసుకోవాలి.

ఈగర్: అతను చెప్పింది సత్యమే. ఈ దౌష్ట్యాని కంతకూ దురాశే మూలం. మొన్న యాకోవ్‌కూడ యిదే చెపుతున్నాడు. యాకోవ్ ఎట్లావున్నాడు దోనాట్!

దోనాట్: అతనా? బలే తెలివిగల కుర్రాడు,

ఈగర్: (తృప్తిచెందినట్టు) తెలివీ! ఒట్టి నిర్లక్ష్యం. అది తెలివి ఎంతమాత్రం కాదు.

దోనాట్: తెలివికలవాడు కనుకే పారిపోయేవాళ్లని నలుగుర్ని పోగుచేసి పెద్ద పటాలంక్రింద తయారుచేశాడు. సమయం వస్తే వాళ్లే తయారవుతారు.

జీనియా: సమయంవస్తే!

ఈగర్: మోకొర్జోవ్‌కు తెలిస్తే లేనిపోనిబాధ. ఈసంగతి తెలిస్తే చాలా బాధ పడాలి.

దోనాట్: మోకొర్జోవ్‌కి అంతా తెలుసు. అతడు గోడమీది పిల్లిలా కాచుక్కూచున్నాడు నెగ్గినపక్షాన్ని జేరటానికి. మీరెప్పుడూ నిశ్చయంగా వుండొచ్చు. పోలీసువాళ్ల దేముంది? ఎటుమొగ్గితే అటుచేర్తారు.

(స్టాంట్జాఫ్ తిరిగివస్తాడు.)

ఈగర్: బాగుంది. అటుచూడు.........

దోనాట్: ఎలుగ్గొడ్డు సంగ తేం జెపుతారు?

ఈగర్: నీయిష్టంవచ్చినట్టు చెయ్యి.

స్టాంట్జాఫ్: ఇందులో నన్ను సలహా చెప్పనివ్వకూడదూ? జనరల్ బెట్లింగ్‌గారికే ఎలుగునిచ్చేద్దాం.

ఈగర్: ఎవరు తీసికొన్నాసరే; నాకుమాత్రం అక్కర్లా. నీక్కావాలిస్తే నీవే బిషప్పు కిచ్చుకోవచ్చు.

జీనియా: బిషప్పు వేటాడుతూంటే చూడాలనుంది నాకు.

దోనాట్: ఒకమనిషిని జనరల్‌గారివద్దకి పంపిస్తాను.

ఈగర్: నా కేమీ తోచటంలేదు దోనాట్! నాకు జబ్బుచేయటం వల్ల అంతా యీ స్థితికి వచ్చింది. (దోనాట్ లేచి వంగి బయటికి వెళతాడు.) జీనియా! షూరాని నా దగ్గరకి పంపించు. (ఆమె వెళ్తుంది.) బాగుంది. నీ కేంకావాలి? పద.

స్వాంట్జాఫ్: అది లాప్టేవ్ సంగతిలెండి.

ఈగర్: ఊఁ.

స్వాంట్జాఫ్: దోనాట్ చెప్పలా మీకు, యాకౌ పారిపోయేవాళ్ళ తోటే కలిసి వుంటున్నాడని? అతను రైతులకి విప్లవోపన్యాసాలు కూడ యిస్తున్నాడని వాళ్ళంటున్నారు.

ఈగర్: ఏమి రైతులో! ఏమి వుపన్యాసాలో! నేను అనుభవం మీద చెపుతున్నాను. రాజకీయోపన్యాసాలు యిప్పుడంతగా వుపయోగించవు వాళ్ళకి. మీ రందరూ యాకౌను పట్టించారేఁ?

స్వాంట్జాఫ్: మా కందరకి తంపంపులు తెస్తూంటే నన్ను చూస్తూ కూచోమంటారా? ఇంతకీ అతడు మన కుటుంబంలో ఒక మనిషేనని గుర్తించుకోవాలి.

ఈగర్: కాని, మీ రతన్ని అట్లా చూడరు. (షూరా వస్తుంది) మీరు మీ పనులు చూసుకోండి. తెల్లవారినప్పటినుంచి ప్రతివారి మీద ఫిర్యాదులు వింటమేనా నా పని? (స్వాంట్జాఫ్ వెళతాడు.)

షూరా: ఇత నేమిటి చెపుతున్నాడు? యాకౌ మీది కథలేనా?

ఈగర్: ఆ గొడవ నీ కొద్దులేవమ్మా! రా, యిలా వచ్చి కూర్చో. ప్రతివాళ్లు నీమీద కూడా ఫిర్యాదు చేస్తున్నారు.

షూరా: ఆ ప్రతివాళ్ళు ఎవరు నాన్నా?

ఈగర్: జీనియా, వర్వరా.

షూరా: వాళ్లు ప్రతివాళ్ళు కాదే!

ఈగర్: షూరా! ఏమి యెగతాళిగా వుంది!

షూరా! మీ రట్లా మాట్లాడితే నా కెంతో ప్రేమ మీ మీద.

ఈగర్: వాళ్లు నాతో చెప్పేరూ, నువ్వు చాల బద్ధకంగానూ, సోమరిగానూ ఉంటున్నావట.

షూరా: మీరూ అలాగే అనుకుంటున్నారా?

ఈగర్: నే నెవ్వరి మాటా వినను.

షూరా: నే నందరి మాటా వింటాను. అదే నాతో వచ్చిన చిక్కు. ఈ వినటం అన్నది నాకు - పుట్టు పాలతోనే వచ్చింది.

ఈగర్: నిన్ను మందలించాలని లేదు నాకు.

షూరా: మందలించాలని లేకపోతే మందలించ నక్కరలేదు అంతే కదూ?

ఈగర్: నువ్వనుకోనేవది. అవునా? నువ్వు వద్దనుకున్నంత మాత్రాన నువ్వు చెయ్యనక్కరలేకపోతే జీవితం గడపటం చాలా సులభమే. కాని, అది అట్లా జరగదు.

షూరా: మీ రెందు కట్లా చేయరాదు?

ఈగర్: మరింకా యితరులతో సంబంధ ముందిగా. మనం యెన్నింటికో బాధ్యులంగా తయారౌతాం.

షూరా: అయితే మీరు నాకు బాధ్యత లేకుండా చేసికోవటం నేర్చాలి.

ఈగర్: నేను నేర్పలేను. [జీనియా ప్రవేశిస్తుంది.] ఏమిటి, జీనియా?

జీనియా: బాష్కిన్ యిప్పుడే డాక్టర్ని తీసుకొచ్చాడు. మీకోసం మీ గదిలో ఎదురు చూస్తున్నారు. షూరా! గౌను సరిగా సవరించుకో. అలా కూర్చోకూడదని నీకు తెలియదూ? (బాష్కిన్ వస్తాడు.)

బాష్కిన్: గుడ్ మార్నింగ్, ఈగర్!

ఈగర్: కొంచెం సాయం చెయ్యి. నేను పడుకొంటే లేవడం కొంచెం కష్టం. (షూరా చేతి నాసరాగా యిస్తుంది.)

బాష్కిన్: (సహాయం చేస్తూ) మీ కెట్లా వుందండీ?

ఈగర్: అంత బాగా లేదు. వైద్య సహాయం అట్టే లాభించి నట్టు కనపడదు. (షూరా వెళ్తుంది.) నేను డాక్టరుతో మాట్లాడాలి. ఇంకా విలువగల ఔషధం పుచ్చుకోవాలి నాకు నయం జేస్తే అతనికి సరిపోయేటంత హాస్పిటల్ కట్టించి యిస్తాను. నయం చేసికోవడమే పని. (బాష్కిన్ మెట్లవరకూ సహాయంచేసి తిరిగివస్తాడు.)

జీనియా: డాక్టరేం చెపుతున్నాడు?

బాష్కిన్: ఇంకా నిర్ధారణ కాకపోయినా ఈయన జబ్బు 'లివర్ మీద రణమని అనుకుంటున్నా'నని డాక్టర్ చెప్పేరు.

జీనియా: ఇదంతా ఆయనకి తెలుసు.

బాష్కిన్: డాక్టరు అపాయకర మన్నాడు కూడాను.

జీనియా: అది నయం చేస్తే డాక్టర్ దణ్ణిగా వసూలు చేస్తాడు.

బాష్కిన్: ఇటువంటి రోజుల్లో జబ్బు పడటం చాలా నష్టం. ప్రతి వాళ్ళూ కాళ్ళూ చేతులా, సంచులనిండా డబ్బు పోగు చేసుకుంటున్నారు.

జీనియా: ఈగర్‌కి ప్రతి అవకాశం యిలాగే పోతున్నది.

బాష్కిన్: దోస్టుగేఫ్ లెక్కపెట్టుకోలేనంత సంపాదిస్తున్నాడు. ఈగర్‌కి మాత్రం ఏం? ఈయనకి వ్యాపారం ఏమీ లెక్క లేదు. పైగా కఠినంగా మాట్లాడతాడుకూడాను. నిన్న మాట్లాడుతూ తన జీవితమంతా పనికిమాలిన వాటిని వెదుక్కుంటూనే గడిపేశానన్నాడు. నీవు మాట్లాడలా ఆయనతో? దీని కంతకీ మూలం? మీ సోదరి డబ్బు వల్లేకదూ యీాయన యెంత చేసినాను. ఈ పాటికి అది రెట్టింపో మూడు రెట్లో అయి వుంటుంది.

జీనియా: నా మూలాన్ని మెలీనియా యీాగర్‌కు ఆస్టే డబ్బు బదులివ్వ లేదులే.

బాష్కిన్: అంటే?

జీనియా: బాష్కిన్! నాదే పొరపాటు. నిన్నే వరించవలసింది.

అతన్ని పెళ్ళిచేసుకున్నాను. నేనుగడిపే జీవితం నీకు తెలియదు. నేను పడే బాధలు అపరిమితం. సవతి కూతురు నా నెత్తిమీద పడ్డది. అదొక కొయ్యలగోపి. తర్వాత స్పాంట్జాఫ్ దొరికా డితనికి అల్లుడుగాను. అతడో పోకిరీ. వాళ్ళిద్దరూ కర్మం చాలక ఈగర్ కేమన్నా జరిగిందంటే పిల్లకాను లేకుండా గొరుగు తారు నన్నూ, నా సొంత కూతుర్నీ.

బాష్కిన్: స్పాంట్జాఫ్ విషయం అంతే.

జీనియా: బాష్కిన్! మా కుటుంబం నీవు చాలా యేళ్ళనుంచి యెరుగుదువు. మా నాన్నగారు నిన్ను నిలబెట్టారు. నా కేదేనా జరిగితే నీమీదే భారమేసుకొని కూర్చు న్నాను. (స్పాంట్జాఫ్ వస్తాడు)

స్పాంట్జాఫ్: డాక్టర్ వెళ్ళాడా?

జీనియా: లేదు. ఇంకా ఈగర్ దగ్గరే ఉన్నాడు.

స్పాంట్జాఫ్: (బాష్కిన్‌తో) బెట్లింగ్ దగ్గరకు వెళ్లారా?

బాష్కిన్: ఆఁ.

స్పాంట్జాఫ్: ఏమయింది?

బాష్కిన్: అయిదు వేలవుతుందట.

స్పాంట్జాఫ్: ఈ రోజుల్లో డబ్బుకి కరువేమిటి?

బాష్కిన్: గవర్నమెంటు ఆర్డరంటే చాలా డబ్బవుతుందన్న

మాట. అదీ కాకుండా అతని కషాయం కూడాను. ఈ సంగ తేమైనా బయటకి ప్రాకిందా, అతని కొంప కూలిపోతుంది.

స్వ్యాంట్జాఫ్: ఈగర్ ఒప్పుకొన్నాడా?

బాష్కిన్: నే నడిగొచ్చిందే అది. (డాక్టర్ వస్తాడు.)

డాక్టర్: (స్వ్యాంట్జాఫ్ చేయి చేతితో కలిపి) నేను చేయగలిగిందంతా చేస్తాను. రోగి పడకమీదే ఉండాలి. ఏమీ ఉద్రేకం కలుగచేయరాదు. అందులో వ్యాపార విషయాలసలే చెప్పరాదు. ఇటువంటి సమయంలో ఏమైనా మనస్సు ఎక్కువ శ్రమ పడితే రోగికి చాలా అపాయం.

జీనియా: ఏమైనా విశేషాలుంటే నాతో చెప్పండి. నే నాయన భార్యను.

డాక్టర్: ఇదమిత్థమని యేమీ చెప్పలేనిప్పుడు. నేను కూడా కొంత ఆలోచన చేసికోవాలి. నేను తరవాత ఫోన్‌లో చెపుతానులెండి. (అతడు వెళ్లును.)

జీనియా: మళ్లీ యింకో యాభై అంటుననేందుకు తరువాత చెపుతాట్ట.

స్వ్యాంట్జాఫ్: ఆపరేషను అవసరం అంటున్నాడు.

జీనియా: ఆపరేషన్! నేను వినలేదే. ఇది మరీ విపరీతంగా వుంది. అలాంటి అవసరం యేమీ లేదే. (గ్లాషా

యెదమ ప్రక్కనుంచి వచ్చి మేడ మెట్లుఎక్కుతోంది
ఎక్కడికి వెడుతున్నావు?

గ్లాషా: పైని పిల్చారు.

జీనియా: నేనూ వస్తా నీతో (ఇద్దరూ బయటకు వెళతారు.)

స్వ్యాంట్జాఫ్: ఎటువంటి రోజుల్లో వచ్చిందో చూడు యీ పాడు జబ్బు.

బాష్కిన్: అవును. ఎంతో కష్టంగా వుంది. అతని తెలివి కీరోజులలో ఎంతో సంపాదించొచ్చు.

స్వ్యాంట్జాఫ్: అదే కాదు. పెద్ద విప్లవం రాబోతోంది.

బాష్కిన్: ఇలాంటివి వస్తుంటవి, పోతుంటవి. 1905లో యిలాంటిదే ఒకటొచ్చింది.

స్వ్యాంట్జాఫ్: ఈసారి వచ్చేదిమట్టుకు గట్టి విప్లవమే. అప్పుడు రైతులు విప్లవకారులతో చేరలా. ఇప్పుడు రైతులే మొట్టమొదట దారి తీస్తున్నారు. ఈసారిది పెట్టుబడిదార్లను తీసేసే విప్లవం అవుతుంది.

బాష్కిన్: అదీ కొంత నయమే. దేశమంతా గవర్నరులూ, మంత్రులూ, లాయర్లు, యింకా పెద్ద జీతగాళ్ళతో నిండిపోయి వుంది.

స్వ్యాంట్జాఫ్: జార్ పరిపాలన యిక కూలిపోయినట్టే.

బాష్కిన్: పెద్ద పెద్ద వ్యాపారస్తు లందరూ అనుకుంటున్న మాటే. (వర్వారా ప్రవేశించి వింటూంటుంది).

స్వ్యాంట్జాఫ్: అవును. గ్రిగరీరాస్పుటిన్. అతను కుదరని రోగా

లెన్నో కుదిర్చాదుట.

బాష్కిన్: నాకు మంత్రాల్లో నమ్మకం లేదు.

వర్వరా: ఏమిటి మీ బాతాకానీ?

బాష్కిన్: పట్టణాల్ని గురించి మాటలాడుకుంటున్నాము. ఇకను జార్ లేకుండా పరిపాలన సాగదని నే ననుకుంటు న్నాను.

స్వాంట్జాఫ్: జార్ నామమాత్రమే. గవర్నమెంటు కత నప్పుదే స్వాధీనపరిచేదు. (వర్వరాతో) ధర్మప్రదర్శనం పూర్తి అయిందా?

వర్వరా: రేపటికి వాయిదా వేశారు. ఇంకా అయిదు వందల మంది వికలాంగులు వస్తారని అనుకొంటున్నారు. వాళ్ళకు చోటు లేదు.

గ్లాషా: (మెట్లమీద) బాష్కిన్ మిమ్మల్ని పిలుస్తున్నారు. (బాష్కిన్ వెళ్తాడు.)

వర్వరా: అతని ముందు అంత అవివేకంగా మాటలాడుతారేం? అతను అమ్మకి చాడీలు మోస్తాడు. మీ రసలు వాడితో ఎందుకు మాటలాడతారు?

స్వాంట్జాఫ్: ఈగర్ మన పని కొప్పుకోకపోతే జనరల్ బెట్లింగుకి లంచమివ్వడానికి డబ్బు యితనివద్దే బదులు పుచ్చుకోవాలి మరి.

వర్వరా: అంచేతే పైజా ద్వారా అయితే పని సులభంగా అవుతుంది అన్నాను. గవర్నమెంటు కంట్రాక్టంటే బోలె

డంత డబ్బు. దోస్టు గేఫ్ కయినా సరే ఒకసారి అది ప్యాసయిందా తరవాత మనల్నే తిట్టిపోస్తారు.

స్వాంట్జాఫ్: ఈ సంగతంతా దోస్టుగేఫ్‌కి తెలిస్తే బెల్లింగునీ మన్నీ అందర్నీ టోపీ వేస్తాడు. ఆ ఆర్డర్లు తనే పుచ్చుకొంటాడు.

జీనియా: (మెట్లు దిగి వస్తూ) ఏం లాభం ఆయన్ని పడకమీద పడుకోమని చెప్పటం? ఇటు, అటు నడుస్తూ ఆ జాష్కిన్‌ని తిడుతున్నాడు. మళ్ళీ యిప్పుడు క్రిందికి దిగి వస్తున్నారు.

ఈగర్: (జాష్కిన్‌తో లోనికి వస్తూ) డబ్బెక్కడ నుంచి వస్తుందయ్యా! ఉఁహుఁ, ఇదిగో, అది రైతులనుంచే రావాలి.

జీనియా: మీ రిలా ఉద్రేకం పొందకూడదు. ఉద్రేకం మీకు అపాయమని చెప్పాడు డాక్టర్.

ఈగర్: ఎవరికి ఉద్రేకం? మీరు జరిగే సంగతులు జరిగినట్టుగా చూట్టం లేదు. మీరు నాకు తెలియదనుకుంటున్నారా? నేను డబ్బు సంపాదించేటప్పుడు రైతును పీడిస్తున్నానని కదూ మీ వుద్దేశం? డబ్బు పోగుచేయడం నా వృత్తి. దానివల్ల నా కేమీ తప్పు లేదు. వసూలు చేయనంత మాత్రంచేత రైతు హర్షిస్తాడనుకోకూడదు.

జీనియా: వర్వరా! నీవన్నా చెప్పరాదూ? డాక్ట రాయన్ని పడు

కొని ఉండమన్నాడు.

ఈగర్: నేను పడుకొని ఉండాలన్నాడూ? దానికోసమే మీ రందరూ కనిపెట్టుకు కూచున్నది. మీ రందరూ బాష్కిన్‌తో రైతు నెత్తి కొట్టడం ఎలాగని కుట్రలు పన్నుతూంటే నేను పడుకొని ఉండాలీ? నా కక్కర లే దావని.

స్వాంట్జాఫ్: ఆయన యాకొ చెప్పినట్లు చేస్తున్నాడు.

ఈగర్: అయితే ఏం? ప్రతి వాళ్ళూ ఈ యుద్ధా న్నాధారం చేసుకొని డబ్బు సంపాదించుకుంటున్నారు. నేను వాళ్ళలో ఒకణ్ణి కాదల్చుకోలేదు. మీ రెందు కింకా కాచుకు కూర్చున్నారు?

జీనియా: రా! వర్వరా! (స్వాంటాఫ్, వర్వరాలతో ఆమె వెళ్తుంది.)

ఈగర్: గ్లాషాతో ఒక గ్లాసు విస్కీ తెమ్మని చెప్పు.

బాష్కిన్: ఈగర్! నేను............

ఈగర్: పో, అవతలికి పో. (బాష్కిన్ వెళ్తాడు) నే నింకా చావలేదులే. నాకు నచ్చినట్టు నేను చేస్తాను. (అతని పార్శ్వం బాధ పెడుతుంది. అతడు లేచి కదులుతాడు) ఇది నా కర్మ. (గ్లాషా వస్తుంది) గ్లాషా! నేను చచ్చి పోతాను.

గ్లాషా: మీ రట్లా అనకూడదు.

ఈగర్: నీకు లెక్కే, కాదూ? కొంచెము విస్కీ తీసుకురా.

గ్లాషా: మీ రది త్రాగడానికి వీల్లేదు.
ఈగర్: వాళ్లు తాగనివ్వరు. కాని, నువ్వు కొంచెం తెచ్చి పెడుదూ. (తెర)

## రెండో రంగము.

[మొదటి రంగ స్థలమే. సాయింకాలం. స్వాంట్జాఫ్. టయాటిన్ కూర్చుని ఉంటారు. టేబిల్ మీద వైన్ బాటిల్ ఉంటుంది.]

స్వాంట్జాఫ్: (సిగరెట్టు వెలిగిస్తూ) నీకు తెలిసిందా?
టయాటిన్: ఆఁ. తెలిసిందనే అనుకుంటాను. కాని, నాకుమాత్రం యిష్టం లేదు.
స్వాంట్జాఫ్: నీకు డబ్బు కావాలి.
టయాటిన్: అవు నవును. అదంతా నిజమే. నాకు ధనం కావాలి.
స్వాంట్జాఫ్: అయితే నేను చెప్పవలసిం దేమీ లేదు.
టయాటిన్: లేదు. ఇంక చెప్పదగిం దేమీ లేదు. నేను చెప్పగలి గిందేమిటంటే నా కిష్టం లేదని మాత్రమే. నాఅంతట నేనూ ఆలోచించుకోవాలిసింది. ఆవి డదో రకమైన మనిషి. నే నావిడతో సరిగ్గా ప్రవర్తించగలనా?
స్వాంట్జాఫ్: కావాలిస్తే విడాకు లుండనే ఉంది.
టయాటిన్: అవు నవును. విడాకు లున్నాయి. కాని, డబ్బు? డబ్బు మాత్ర మావిడతో పోదూ?
స్వాంట్జాఫ్: దానికంతా చేద్దాం. నీ కే మయినా సహాయం కావలిస్తే

నేను మూరాను మెల్లిగా దువ్వుతాను.

టియాటిన్: నీ వావిణ్ణి బుట్టలో పెట్టలేవు. ఆమె సామాన్యపు మనిషి కాదు.

స్వాంట్జాఫ్: సామాన్యం కాకపోతే మరీ మంచిది. అటువంటావిడకి భర్తను చూడటం మరీ కష్టం. ఆవిడకి కట్నం మరీ ఎక్కువ.

టియాటిన్: అవు నవును. అది చాలా తెలివైన పని. ఇంతకూ ఆవిడకి కట్నం ఏమాత్రం ఉంటుం దనుకుంటావు?

స్వాంట్జాఫ్: యాభై వేలు. ఇం కేమైనా తెలిసికోవాలా?

టియాటిన్: ఏమీ లేదు. ఆవిడతో నేను మసులుకోగలనని నీకు పూర్తిగా నమ్మక ముంటే........ (దోస్టుగేఫ్ లోపలకి వస్తాడు.)

స్వాంటాఫ్: అయితే అన్నీ కుదిరినట్లే. నాకు చాలా సంతోషం. నీ విప్పటికైనా నా దృక్పథం తెలిసికొన్నావు.

టియాటిన్: నీ దృక్పథము? ఓః అవును.

దోస్టుగేఫ్: ఏమిటి, మీ రిలా విచారంలో ఉన్నట్టు కనపడతారు?

స్వాంటాఫ్: నేనా? ఓః నేను........ మేము ఒకర్ని గురించి మాట్లాడుతున్నాము.

దోస్టుగేఫ్: నేను ఎరిగిన వాళ్ళెవరన్నా నా?

స్వాంట్జాఫ్: లేదు. ఉ(..... అవు నవును. మేము యిప్పుడే రాస్పుటిన్‌ను గురించి మాటలాడుతున్నాము.

దోస్టుగేఫ్: ఓః బలే నాటక మవుతుంది. ఒక సామాన్యపు నైతీ

రియా రైతు మంత్రులను చదరంగపు బంట్లుగా నడి
పిస్తాడు. ఆ జాతియొక్క సర్వ శక్తులూ అతని
చేతిలో వుంటై. అతను పది వేలకు తక్కువ లంచాని
కొప్పుకోడు. ఏమిటి మీరు త్రాగేది?

స్వాంటాప్: మా మామగారి నెట్టా చూచారు మీరు?

దోస్టుగేఫ్: ఈగరునా? అత న్నెట్లాను చూడాలి. నేనూ ఓ గ్లాసు
తాగాలి. అతని ఆరోగ్యం అట్టే బాగున్నట్టు లేదు.
(వైను తాగుతాడు.)

స్వాంటాప్: మీరు?

దోస్టుగేఫ్: అతడు కూడ అలాగే అనుకుంటున్నాడు. అది మహా
చెడ్డ లక్షణం. చావంటే భయపడే వాడే సాధారణంగా
మొదట చస్తాడు. ఇటువంటి సమయంలో మనం
సంగతులు దాచకూడదు. మన పరిస్థితు లేమీ బాగా
లేవు. వాళ్ళే యీ కష్టానికి కారణం. గవర్నరు కూడా
ఒప్పుకు తీరాలి యీ నష్ట మంతా మనకేనని.

స్వాంటాప్: మాస్కోలో ఫాక్టరీ కూలీలంతా 'విప్లవ ముహూర్తం'
కోసం కనిపెట్టుక్కూర్చున్నారు. (వర్వారా ఎలయిజ
వేటాతో ప్రవేశిస్తోంది.)

ఎలయిజ వేటా: వీళ్ళిక్కడ తెగ తాగుతున్నారు. ఈగరక్కడ
అమెరికాను గురించి వినలేనంత అసహ్యంగా వాది
స్తున్నాడు.

దోస్టుగేఫ్: అమెరికా ఎందు కైశ్వర్యంతో తులతూగుతోంది?

అధికారం వ్యాపారస్తుల చేతిలో ఉందికనకనే.

వర్వరా: అమెరికాలో నౌకర్లకు కూడ స్వంత కారు లుంటా యని జనరల్ బెట్లింగ్ అన్నాడు.

దోస్టుగేఫ్: నీ వీ మధ్యనే బెట్లింగుని చూచావన్నమాట. వ్యాపారమా? కాకపోతే వర్వరా యింకా మిలిటరీ వాళ్ళతో తిరుగుతోందా?

వర్వరా: అది పాత సంగతి. నాకు నచ్చదు. టయాటిన్! ఏమి టాలోచిస్తున్నావు?

టయాటిన్: ఉఁ. నే నేమిటి ఆలోచిస్తున్నాను? అబ్బే! ఏమీలేదు. (వర్వరా ఎలయిజవేటా చెవిలో ఏదో చెపుతూ టయాటిన్‌ను చూపిస్తుంది.)

ఎలయిజవేటా: టయాటిన్! మనం యిద్దరం కొంచెం దూరం కలిసి వెళ్ళాలి.

టయాటిన్: ఉఁ.

ఎలయిజవేటా: వీళ్ళు వ్యాపారాల్ని గురించి మాట్లాడుతూంటే మనం కొంచెం సేపు ప్రేమను గురించి మాట్లాడుకోవాలి. మనం పోదామా?

టయాటిన్: ఉఁ. అట్లాగే. అంటే మీ రనేది మనం యిక్కడుండ కూడదనేనా? (ఆమె అతనిని బయటకి తీసుకుపోతుంది.)

దోస్టుగేఫ్: అవును కాని, వర్వరా! అదేమిటి?

వర్వరా: మాకు మీ సహాయం కావాలి. అమ్మా, బాష్కిన్

మెలీనియా కోసం పంపించారు.

దోస్టుగేఫ్: ఆమె వ్యాపారం జీనియా పేరుతో జరగా లంటూంది. స్వాంట్జాఫ్ పేరుతో గాదు.

స్వాంట్జాఫ్: ఆవిణ్ణి స్వాధీనపరచుకోటానికి ఏదో మార్గం చూడాలి

దోస్టుగేఫ్: ఆ వ్యాపారంలో ఆవిడి సొమ్మెంత వుంది?

స్వాంట్జాఫ్: దాదాపు నూరు వేలు.

దోస్టుగేఫ్: చాల తక్కువే. అది ఆవిడ స్వంతమా? వాళ్ళ ఆశ్రమానికి సంబంధించిందా?

వర్వరా: దాన్ని మే మెల్లా తెలిసికోగలము?

దోస్టుగేవ్: తెలిసికోటానికి మార్గాలు లేవనా? ఆ డబ్బెవ్వరికో సంగతు లన్నీ తెలుసుకొనే వరకూ నీ రేసు చేయ డానికి వీలులేదు. చాలా మార్గాలున్నాయి. ఒకావిడ అంటే బిషప్పుకు చాల ముఖ్య స్నేహితురాలు. ఓ కాయన, ఆయన సంగతి తరువాత చెపుతాను. నేను ఆవిడతో మాటలాడి ఆ సొమ్ము ఆశ్రమంవైతే.... (గ్లాషా గ్లాసులను తీసివేయడానికి లోపలికి వస్తుంది) మనందరం యిప్పుడు ఎలయిజవేటాను కలుసుకొం దాం. (వర్వరా తన దుస్తులు కుర్చీకి తగులుకున్న ట్టు నటిస్తుంది.)

వర్వరా: ఆంద్రెజ్! నా దుస్తులు సరిచెయ్యి. (స్వాంట్జాఫ్ ఆమె దగ్గరగా వస్తాడు.)

స్వాంటాఫ్: నీవు బెట్లింగుని గురించి చెపుతున్నప్పుడు చెవు లెలా పెట్టుకొని వింటున్నాడో చూశావా?

వర్వారా: అంచేతే నేను మెలీనియా సంగతి చెప్పేను. మనకి డబ్బు కావాలంటే యిదే మంచి అనుకూలం. టయాటిన్ ఏమంటాడు?

స్వాంట్జాఫ్: నే నతనితో తంటాలు పడతాను.

వర్వారా: మీరు త్వరగా కానివ్వాలి. అ దెంత శీఘ్రంగా అయితే అంత నయం. ఇప్పుడు నాన్నగారు చచ్చిపోతే మనం ఏ పని చెయ్యడానికి వీళ్ళ మూలాన్ని ఆగవలసి ఉంటుంది. ఇంకా చాలా యితర కారణాలు కూడా ఉన్నవి. (వాళ్లు పోతారు) యాకౌ వంటింటి లోనుంచి వస్తాడు.)

గ్లాషా: ఏం యాకౌ? వాళ్లు నిన్న నీవు కోఫేసాఫ్‌లో ఉన్నావని చెప్పారే?

యాకౌ: అయితే నీకు ఆశాభంగం కలిగించన్న మాట.

గ్లాషా: ఎప్పుడూ నవ్వులే నీకు. నీ నవ్వులతో ఎప్పుడో ఒక నాడు చాలా కష్టపడతావు.

యాకౌ: ఎవ్వళ్ళకీ ఫరవా లేదు, గ్లాషాకి తప్ప. (నవ్వుతాడు.)

గ్లాషా: పోదూ! దోస్టుగేఫ్, స్వాంట్జాఫ్ ఆవతల గదిలో ఉన్నారు.

యాకౌ: వాళ్ళిద్దరూ నా కక్కరలేదు.

గ్లాషా: షూరాతో చెప్పనా నువ్విక్క డున్నావని?

యాకౌ: తప్పకుండాను. ఒక నిమిషం ఆగు — ముసలాయన ఎట్లా ఉన్నాడు.

గ్లాషా: ఏమిటి? — ముసలాయన! నువ్వు కొంచెం గౌర వంగా మాటలాడటం నేర్చుకోవాలి.

యాకౌ: చాలా విచారమండీ, గ్లాషా పిన్నిగారూ! మహారా జశ్రీ ఈగర్ బులిషాఫ్ బాబుగారు ఎట్లా ఉన్నారండీ?

గ్లాషా: ఆయన కేమీ బాగా లేదు. ఆయన పార్శ్వం చాలా బాధ పెడుతూంది.

యాకౌ: గ్లాషా! నా స్నేహితులు కొందరు చాలా బాధ పడు తున్నారు. ఆకలితో మాడిపోతున్నారు. మాకో బస్తా పిండి యిప్పించగలవా?

గ్లాషా: అంటే నన్నిప్పుడు వీ రింట్లోంచి దొంగతనం చెయ్యమనా?

యాకౌ: అయితే గ్లాషా! ఇది మొదటిసారి కాదే నాకోసం దొంగిలించటం. నీవంటే ఈగర్ ఏమీ అనుకోడు.

గ్లాషా: బాగానే ఉంది. ఇవన్నీ మునుపు విన్నవేగా! నేను పొద్దున్న దోనాట్ దగ్గరికి ఒక బస్తా పంపిస్తాను. మీ రతని దగ్గర్నుంచి తీసికోవచ్చు.

యాకౌ: నమస్కారాలండీ పిన్నీ!

జీనియా: (లోపలికి వస్తూ) ఏం? ఇక్క డేం చేస్తున్నావు యాకౌ?

యాకౌ: నేనేం చేస్తున్నాననుకుంటున్నావు నువ్వు? గ్లాషాతో మాటలాడుతున్నాను.

జీనియా: ఓనిమిషం ఎక్కడా కనపడదు, మరు నిమిషంలోనే వంటింట్లో సిద్ధం! నీకు తెలుసునా మీ బాబయ్య గారికి చాలా జబ్బుగా ఉందని.

యాకౌ: గ్లాషా యిప్పుడే నాతో చెప్పింది.

జీనియా: బాగుంది. నిన్ను కష్టాలలోకి తోసే ఆ పనిని గురించే మాటలాడుకుంటూ నీ కాలం అంతా వృధా చెయ్యక పోతే, కాస్త యీ సంగతులు పట్టించుకోరాదూ? వాళ్ళంతా జార్‌ని పడగొట్టడానికి కుట్ర పన్నుతున్నారని వింటున్నానులే.

యాకౌ: సాధ్యం కావచ్చు.

జీనియా: నీతోటి ఎవ్వరూ చెప్పలేరు. గ్లాషా! (గ్లాషా, జీనియా వెళ్తారు. షూరా వస్తుంది.)

షూరా: నువ్విక్కడున్నావని విన్నా. జీనియా పోయేవరకూ కాచుక్కూర్చున్నా. ఎట్లా ఉన్నావ్?

యాకౌ: షూరా! నేను మాస్కో తప్పక వెళ్లాలి. నాకు కొంచం డబ్బు కావాలి.

షూరా: నా దగ్గర ముప్ఫై రూబుల్సు మాత్రం ఉన్నాయి.

యాకౌ: అధమం ఏభై కావాలి.

షూరా: ఏలాగో యిస్తానులే.

యాకౌ: సాయంత్రానికి ఆఖరు రైలుకన్నా వెళ్ళాలి. నీవు సిద్ధం చేయగలవా?

షూరా: ఆఁ. యాకౌ! విప్లవం వస్తుందా? నాతో చెప్పు.

యాకౌ: వస్తుందా ఏమిటి? అ దప్పుడే మొదలయితేను.

షూరా: నిజంగానా?

యాకౌ: టయాటిన్‌ను అడుగు కావలిస్తే.

షూరా: యాకౌ! నాకు నిజం చెప్పు. టయాటిన్ ఏం చేస్తున్నాడు?

యాకౌ: న న్నడుగుతా వెందుకు? నువ్వు ఆరు నెలలనించి ప్రతి రోజూ చూస్తూనే వున్నావుగా.

షూరా: అతన్ని గురించి విశేషాలు చెపుదూ.

యాకౌ: జీవితంలో చాలా ఆశాభంగం అయిం దతనికి. విశ్వ విద్యాలయంలో రెండో యేడు చదువుతూండగా బయటకి పంపేశా రతన్ని. ఇప్పు డతను స్వాంట్జాఫ్‌కోసం పని చేస్తున్నాడు. స్వాంట్జాఫ్ కోసం పని చేయడం మూర్ఖత్వమే.

షూరా: స్వాంట్జాఫ్ ఒక నల్లత్రాచు.

యాకౌ: ఒక అసలైన ప్రజా సామ్యవాది.

షూరా: ఈ రాత్రి డబ్బు యివ్వడానికి ని న్నెక్కడ కలుసుకునేది?

యాకౌ: గ్లాషా కియ్యి. ఆమె నా కందిస్తుంది.

షూరా: అయితే గ్లాషా టయాటిన్ కుట్రలో ఉన్నదన్నమాట.

యాకౌ: కుట్రేమిటి?
షూరా: యాకౌ! నేను కూడా సహాయం చెయ్యాలని ఉంది.

యాకౌ: నువ్వా!
షూరా: అవును. నేను చెయ్యకూడదా? నేను నిజమే చెప్పు తున్నాను.

యాకౌ: ఎవరో వస్తున్నారు. నే నింక లోపలికి వెళ్ళదలచుకో లేదు. సాయంత్రం తప్పక యివ్వాలిసుమా!
షూరా: అలాగే.
యాకౌ: వెలవు. (అతడు వెళ్తాడు. అలెగ్జీ, దోస్టుగేఫ్ వస్తారు.)
అలెగీ: షూరా! నీ వెక్కడుంటావో అనుకున్నాను. నిమిష నిమిషం నీ సౌందర్యం పెరిగిపోతోంది.

షూరా: అయితే నీకేం?
అలెగ్జీ: నాకేంటంటావేమిటి? సర్వమూ నాకే. నా దృష్టి అంతా నీ అందంమీదనేగా. నువ్విప్పుడే నాకు నచ్చిన రకంగా అందంగా ఉన్నావు.
షూరా: థాంక్సు. నాకు సెలవు.
అలెగ్జీ: అమ్మ పెంకి పిల్ల! (అంటోనియా టయాటిన్‌తో వస్తుంది.

అంటోనియా: ఏం జరిగింది? అలెగ్జీ ఏమైనా వేపుకు తింటు న్నాడా నిన్ను? గాసు చూశాడంటే ఊరుకోలేడు. ఇంతకు ముందే గ్లాసాను బుట్టలో వేసుకుంటానికి

ఎంతో ప్రయత్నం చేశాడు.

అలెగ్జీ: టోనియా! నీ బడాయి కట్టిపెట్టు. గ్లాషాని నేనెందుకు లోబరచుకో కూడదు? ఆవిడ యీ యింట్లో నౌకరీ చేసినంత మాత్రాన కావరాని కనుకూలం కాదని ఎవ రనగలరు?

అంటోనియా: అంత కంతకు బాగుంది అలెగ్జీ వరస. ఇతను తనొక పైనికుడనని మనకు జ్ఞాపకం చెయ్యడానికని అట్లా మాటాడతాడు. యుద్ధంలో యితణ్ణి మొదటి వరుసలో చూడాలని ఉంది. వట్టి పిరికి పంద. పిన తల్లి అంటే ఇంకా చాలా భయంతోనే బ్రతుకుతు న్నాడు.

అలెగ్జీ: టోనియావన్నీ పచ్చి అబద్ధాలు.

అంటోనియా: పైగా యితడు అసలైన బ్రహ్మచారి. ఎప్పుడైనా ఏ ఆడదైనా యితని మాటలు నమ్మకంగా తీసుకొందా యిత డిక అవమానం భరింపలేక చస్తాడు.

అలెగ్జీ: ఇది వింటే నా కొకటి జ్ఞప్తి కొస్తోంది. మూరా! టయాటిన్ నీ కేదో చెప్పటాని కొచ్చాడు.

టయాటిన్: ఉఁహుఁ. అవును. అది....లేదు. నువ్వేమీ చెప్ప నక్కరలేదు అలెగ్జీ!

అలెగ్జీ: నువ్వు టోనియాను పెళ్ళి చేసికోవాలని నా కోరిక. ఆవిణ్ణి నువ్వు పెళ్ళి చేసుకొంటే నేను మంచి కట్నం యిస్తాను.

షూరా: నువ్వు మాట్లాడే దేమిటి?

అలెగ్జీ: ఉస్, వా ళ్ళిద్దరినీ వదిలేద్దాం మనం. (కుర్చీని కదు పుతూ) కుర్చీ లాక్కో అక్కడికి. (షూరాని కూర్చో పెడుతూ) షూరా! కూర్చో. (టయాటన్‌ని బలవం తంగా షూరా దగ్గరకు లాక్కెళ్ళి) ప్రతిదీ పరిసరాల మీద ఆధారపడి ఉంటుంది. రా దోనియా! మనం తెలివిగా నడవాలి. (వాళ్లు పోతారు.)

షూరా: ఇదంతా ఏమిటి? ఏదైనా ఆటా?

టయాటిన్: ఉఁ. అవును. ఉఁ. అది కాదు, కాదు. ఎంతమాత్రం కాదు. (ఆగుతాడు.)

షూరా: బాగుంది. ఎంత కాలం మనం యిలా కూర్చోవటం?

టయాటిన్: ఉఁ హుఁ. అవు నవును. నే నేదో చెప్పా లను కున్నాను.

షూరా: భేష్! (కొంచెం సేపు మాట్లాడకుండా ఉంటారు) బాగుంది. ఏమిటి? ఎంతసేపు?

టయాటిన్: ఉఁ ఉఁ. ఏం చెప్పాను? ఓ! అవును........కొందరు ఏమని సలహా చెపుతున్నా రంటే........ అదినాకు తోచింది.... నీ మూలాన్ని అది చాలా కష్టమై పో తోంది.

షూరా: నువ్వు చెప్పే దేమిటో నాకు కాస్తకూడా తెలియ టంలా.

టయాటిన్: నీవు ఎరుగవూ? నీకు తెలియదూ నిజంగా? లేదు.

నీకు తెలియదులే. నేను ఉఁ ........ నీ కెప్పుడూ
పెళ్ళి చేసుకోవాలని తోచలే దనుకుంటాను.

షూరా: ఇంతకీ ఇదేదైనా సంబంధమా?

టయాటిన్: అవును. సరిగ్గా అదే. నీ తెలివి వల్లే నీవు తెలిసి
కొన్నావు. నీవు తెలిసికో గలవనే నే నలా చెప్పాను.

షూరా: నీవు నన్నే పెళ్ళి చేసుకోవాలని నీకు ఎవరు చెపుతు
న్నారు?

టయాటిన్: నా అంతట నేనే యీ సంగతి ఆలోచించ లేదని
నే నొప్పుకుంటాను. ఇదిగో! నేను........

షూరా: దీంట్లో ఏదో ఉంటని నే ననుకుంటా.

టయాటిన్: అది నిజమే. నీవు చాలా తెలివి గలదానివి. అందు
కే నాకు చాలా భయం. ను వ్వేదో భయం కలిగించే
పని చేస్తావని నే నూహిస్తాను. అంటే ఒక తల
వెంట్రుక వాసి కూడ అనుకోటం లేదు. మీ నాన్న
గారిలాగే నిన్ను కూడా అలా ఉండేటట్టు చేస్తుంది.

షూరా: టయాటిన్! నీవంటే నా కెందుకో యిష్టం లేదు.
(ఆంటోనియా తిరిగి వస్తూంది)

ఆంటోనియా: మా అన్న మళ్లా ఎక్కడికో పోయాడు. ఎప్పుడూ
ఎవరో ఒకరి వెంట పడతాడు. ఇప్పుడు వర్వరావెంట
అనుకుంటా. ఏమయితే నేం అది పూర్తి అయింది.

టయాటిన్: ఇహ్; ఓ! అవు నవును.

ఆంటోనియా: అ దెట్లా పరిణమించింది?

టయాటిన్: ఇహ్! ఓ! అద్భుతంగాను.

షూరా: టయాటిన్ నా కెల్లప్పటికీ సోదరుడుగా ఉండటానికి నిశ్చయించుకున్నాడు.

ఆంటోనియా: జాగ్రత్త షూరా! ఇట్లాంటి తరుణం మళ్ళీ రాదు. నీ జీవితం శూన్యమయిపోతుంది. ఇంక నీవు ఏకాకివై ఒక సన్యాసినివ వయిపోతావు.

షూరా: ఛా. నేను యిదివరకే నిర్ధారణ చేసికొన్నా. నే నొక గొప్ప వేశ్య నై పోతాను. అప్పుడు నా యిష్టం. నన్ననే వాళ్ళందరు. యిదిగో! ఈ విప్లవం పూర్తిగానీ, నా అభివృద్ధి చూద్దువుగాని.

ఆంటోనియా: విప్లవం వస్తుందని నీ వనుకుంటున్నావా?

టయాటిన్: అవును, విప్లవం వచ్చి తీరుతుంది. (గ్లాషా వస్తుంది)

గ్లాషా: షూరా! మెలీవియా వచ్చారు.

షూరా: ఇష్, ఆవిడా, నా గదికి పోదాం రండి. టయాటిన్! స్పాంట్జాఫ్ అంటే నిజంగా నీజంగా నీ అభిప్రాయం ఏమిటి?

టయాటిన్: చుట్టాలు ఎక్కడో కాని ఒకళ్ళ నొకళ్లు గౌరవించు కోరు.

షూరా: అరె! నిజంగా నీవు ఒక్కొక్కసారి చాలా తమాషాగా ఉంటావు.

టయాటిన్: నీకు తెలుసా? నేను కూడా విన్ను ప్రేమించటం మొదలుపెడుతున్నా. (గ్లాషా తలుపు తెరుస్తుంది)

మూరా: పెద్దమ్మ (వాళ్లు పోతారు. మెలీవియా ఈగర్‌తో వస్తుంది. గ్లాషా తలుపు మూసి పోతుంది)

మెలీవియా: అయితే మీ రింకా ఆ భోగపు లంజెను ఇక్కడే వుంచారన్నమాట. ఇంక ఎంతో కాలం ఉండదులే.

ఈగర్: కూర్చో. నీవు నాతో నా వ్యాపారాన్ని గురించి మాట్లాడటానికి వచ్చావు కాని, నైతిక ప్రవర్తన గురించి మాట్లాడటానికి కాదు.

మెలీవియా: జబ్బుగా నున్న నీవు ఇప్పటి ప్రవర్తన కంటె బాగా ఉండటం తెలుసుకోవాలి.

ఈగర్: నా జబ్బుకేంలే. నీ డబ్బును గురించి కబురు పెట్టడానికే వచ్చా వనుకుంటాను.

మెలీవియా: ఆ డబ్బు చర్చిది. నీ కేమయినా అయితే ఈ వ్యాపారం కొత్తవాళ్ళ చేతుల్లో పడుతుంది. అది నాకిష్టం లేదు.

ఈగర్: అయితే నీ పెట్టుబడి తిరిగి తీసికోవా లనుకుంటున్నావా? బాగుంది. అయితే నీ కెవరో చెడ్డ సలహా చెప్పేరు. అది మంచి వ్యాపారం మీదేఉంది. ఇంతకీ నేను చావటం లేదు.

మెలీవియా: మనం చెప్పలేం. దేవుడి పిలుపు ఎప్పుడు వస్తుందో.

ఈగర్: భగవంతుడు నన్ను గురించి కంగారుపడేకంటే వెరే చాలా మంచి పనులు చెయ్యొచ్చు. కాని, కావాలంటే వ్యాపారంలోకి వచ్చి నీ డబ్బు నీవు తీసుకోవచ్చు.

మెలీనియా: నాకు తీసుకోవాలని లేదు. కావి, నా కోరిక ఏమి టంటే జీనియా పేరు మారిస్తే బాగుంటుందనుకుం టాను.

ఈగర్: అది నీ గొడవ కాని. స్వాంట్జాఫ్ అవిణ్ణి దోచు కుంటాడు. నా ముద్దుల కుమార్తె అతనికి తోడ్పడు తుంది.

మెలీనియా: అట్లా అంటే నేను భయపడుతున్నా ననుకోవడం చాలా పొరపాటు నీది.

ఈగర్: నీవు భయపడటం! అదే అసలు సంగతి. మీ రంతా నన్ను భయ పెట్టేరు. నీ దైవం కూడా నన్ను భయ పెట్టేడు.

మెలీనియా: ఓయి పాషండుడా! నేను దైవ సేవిక నని గుర్తుం చుకో.

ఈగర్: నీ వొక దైవ సేవికవే. నీవు దేవుడికి పరిచర్యచేస్తావు గ్లాషా నాకు చేసినట్టు రాత్రిం బగళ్ళనకుండా. గ్లాషాని తొందరలోనే యింట్లోంచి వెళ్ళగొడతా నన్నావట. అంటే నేను చస్తా ననుకుంటున్నావు. నే నెందుకు చావాలి? నాకో చెప్పు. నీవే దైవసేవిక వైతే ఆ దై వం నన్నే ఎందుకు కోరుకోవాలి? దోస్టుగేఫ్ నాకంటె తొమ్మిదేళ్ల పెద్ద. అతను ఇంకా మంచి ఆరోగ్యం తోనే ఉన్నాడు. నీ దైవం అత న్నేరుకోలేదేం? లేక పోతే అతని జీవితం నా జీవితం కంటె నిష్కళం

కమా? నేను పాపం చేశానని ఒప్పుకుంటా. కాని, ఇతరులకంటె నే నెక్కువేమీ చేయలేదే.

మెలీనియా: నీకు కూడ పశ్చాత్తాపానికి యింకా అవకాశం ఉంది.

ఈగర్: పశ్చాత్తాపం! పశ్చాత్తాపం! పశ్చాత్తాపం అంటే ఏమిటి? పాల్లిన్ నా ఐశ్వర్యం అంతా చర్చికి లాక్కోవాలని చూస్తున్నాడు. మేము మా దోపిడిలో కొంత భాగం మీ దైవానికిస్తే పాపాలు త్రోసివేస్తాడు. నేను నీచమైన మీ జట్టులో ఒకణ్ణిగా ఉండనందుకు మీ దైవం నన్ను పరిత్యజిస్తాడన్న మాట. ఇహ! నేను ధనాన్ని, స్త్రీలను ప్రేమిస్తాను కనుక, నీ చెల్లెల్ని ఆవిడ కట్నం కోసం పెళ్ళి చేసుకొన్నాను కనుక, నీకు ప్రియుణ్ణి కనుక, నీవు నా పాపాల్ని గురించి నాతో మాట్లాడతావు. గ్లాషా లాంటి స్త్రీతో కూడ అర్హత లేని నీవు మాట్లాడతావు.

మెలీనియా: నీ మాటలు పడడానికి యిక్కడకి రాలేదు. రాక్షసుడా! (ఆమె పోతుంది.)

ఈగర్: గ్లాషా! గ్లాషా! (అలసి కూర్చుంటాడు)

జీనియా: (లోపలికి వస్తూ) ఏమిటి? మెలీనియా ఏది?

ఈగర్: మెలీనియా వల్లకాట్లో ఉంది. గ్లాషా ఎక్కడుంది?

జీనియా: మీరు మళ్లా మెలీనియాతో దెబ్బలాడేరా?

ఈగర్: తమ రిక్కడ ఎంతసేపు బైఠాయిస్తారు? గ్లాషాను తీసుకు రమ్మని చెప్పాను విన్నావా?

జీనియా: ఈగర్! ఒక్క క్షణం వినండి. ఇప్పుడు నాతో మాట్లాడనైనా మాట్లాట్టం లేదు. ఇంట్లో ఉన్న సామానుతోచే నేనూ లెక్క.

ఈగర్: శెబాష్! కానివ్వు. ఏం చెప్పాలని ఉందో చెప్పు.

జీనియా: ఇంట్లో ప్రతివాళ్ళకి పిచ్చే. ప్రపంచానికి ప్రళయం వస్తోందా! స్యాంట్జాఫ్ తన స్నేహితులతో యిల్లా వింపుతున్నాడు. వాళ్ళ స్తమానం జార్‌ను గురించీ, అతని మంత్రుల్నిగురించీ వాగటంకంటె వేరే పని లేదు.

ఈగర్: ఎవళ్ళంతటు వాళ్ల సుఖంగా ఎందు కుండకూడదు, నా కంత్య క్రియలు జరుగుతూంటే?

జీనియా: మీ రల్లా మాట్లాడకూడదు. మెలీనియా యెందు కొచ్చింది యిక్కడికి?

ఈగర్: మెలీనియా ఎందుకొచ్చిం దిక్కడికి? జీనియా! నీవు సరిగా అబద్దా లాడలేవు - ఏ మూర్ఖుడికైనా తెలుస్తుంది. ఇదంతా నీవే చేశావని. నేను చస్తాను. ఈ డబ్బంతటితోటీ వీరేత్తో వ్యాపారం చెయ్యొచ్చు.

జీనియా: మీ బుద్ధికి వెలవిస్తారా? మెలీనియా యిక్కడి కొచ్చే ఏర్పాట్లు చేయడానికి నాకు ఖాళీ ఎక్కడ?

ఈగర్: అంతా నిజమే! అసంతా నిజమే!

(దోస్టుగేఫ్, పావ్లిన్, స్యాంట్జాఫ్ వస్తారు.)

దోస్టుగేఫ్: పావ్లిన్ మాస్కోనుండి తెచ్చిన వార్తలు వినండి.

జీవియా: ఈగర్! మీరు పడుకుంటే మంచిది.

పాల్లిన్: ఏమీ సంతోషించే వార్తకాదులే. అయినా అదంత నిశ్చయమయిందీ కాదు. నిశ్చయమయినా నాకెంత మాత్రం సంతోషంలేదు. కాని యుద్ధానికి ముందుండే పరిస్థితులకి' నేను సంతోషిస్తున్నా.

దోస్టుగేఫ్: మీకు సంతోషం కావచ్చు. మాకు మాత్రం కాదు. (స్వాంట్జాఫ్ జీనియాతో రహస్యంగా మాట్లాడతాడు)

జీనియా: ఏడ్పు? (ఇద్దరూ వెళ్లుతారు.)

దోస్టుగేఫ్: ఎవ రా ఏడ్చేది?

ఈగర్: మెలీనియా. మీరు బయటికిపోయి ఆమెనుచూడండి. వాళ్ళిద్దరు ఏం కుట్రపన్నుతున్నారో తెలుసుకోండి. (దోస్టుగేఫ్ వెళ్తాడు.) పాదరీ! కూర్చోండి. సంగతంతా చెప్పుతా.

పాల్లిన్: మాస్కోలో ఒక పెద్ద నిర్ణయించింది. రాజనీతి నిపుణులుకూడ జార్ ని పదభ్రష్టుణ్ణి చేయడానికి ఒప్పుకున్నారు. పాలించడానికి కనపడడు పైగా!

ఈగర్: క్రితం 20 సంవత్సరాల్నించి ఆయనే పాలించాడే.

పాల్లిన్: మానవుని బలం కాలంలో క్షీణించిపోతుంది.

ఈగర్: 1913 లో రోమనాఫ్ వాళ్ళ మూడుశకాల ఉత్సవం చేసినప్పుడు నికోలస్ నాకు కరస్పర్శ చేశాడు. రష్యా అంతా కూడా సంతోషించింది.

పాల్లిన్: నాకు తెలుసును.

ఈగర్: అప్పణ్ణించి జరిగిందేమిటి? జార్ నేమనటానికి వీలు లేదు. అతణ్ణి ఆ స్థానంలో ఉంచిన ఆ పద్ధతిని అన వలసిందే. మనందరికీ చాలా హక్కులున్నాయి. కాని అవన్నీ నిరుపయోగం. మనం చావటానికే బ్రతుకు తున్నాం. నేనే కాదు, నీవు, జార్, మనందరము, ప్రపంచంలో విచ్చలవిడిగా తాండవిస్తూన్న ఆ క్రూర భయంకర రాక్షసి చేతిలో చావవలసిందే. ఈ యుద్ధ మున్నదే, తన బలికోసం మనుష్యులను ఏ కొందరినో మాత్రం ఏరుకోదు: తతిమ్మా అందర్నీ కబళిస్తుంది.

పాల్లిన్: మీరు యుద్ధాన్నిగురించి కంగారు పడకూడదు. దైవా న్ని నమ్మండి. అన్నీ సవ్యంగానే గడుస్తాయి.

ఈగర్: అన్నీ సవ్యంగా గడుస్తవంటే? క్రొత్తేముంది? మీరు నాకు తెలిసి నప్పటినుంచి చెప్పుతూన్నదే యిది. చెడుగులోకి వెళ్ళడానికి చెడుగే అవసరమని చెప్పొచ్చేవాళ్లు మీవంటివాళ్లే.

పాల్లిన్: మనం యీ భారాన్ని ఓర్పుతో సహించాలి.

ఈగర్: ఎందుచేత? ఎందుచేతననే నే నడిగేది? కోర్టులో ఎప్పు డైనా మీ దేదైనా వ్యాజ్యముంటే ఎందుకుండ దీ ఓర్పు? మీకు వీలుగానున్న ప్రతి ఆయుధం మీ రుప యోగిస్తారు. చర్చికోసం మీరు వేసిన వ్యాజ్యాలు నాకు తెలియ వనుకుంటున్నారా? మీ రిప్పుడు నా బాధని ఓర్పుతో సహించాలంటారు. కాని నేను సహిం

చరేను. నేను చావవలసివుంటే తప్పక చస్తాను. కాని దేవుడిముందు మోకరించి అనవసరమైన ప్రార్థనల తోటి, కృతజ్ఞతలతోటి, అభివందనాలతోటి మాత్రం కాదు చచ్చేది; నే నెందుకు అభినందించాలి దేవుణ్ణి?

జీవియా: (లోపలికివస్తూ) ఈగర్! యాకౌ నరెస్టు చేశారని చెప్పడానికొచ్చాడు బాష్కిన్.

ఈగర్: అయితే వాళ్లు యాకౌ నరెస్టుచేశారన్నమాట. ఇప్పుడు మీరు చెప్పిన నీతి సూత్రాలకు మీకు కృతజ్ఞాణ్ణి పాదరీగారూ! (జీవియాతో) బాష్కిన్‌ను నా దగ్గరకు పంపించి, గ్లాసెడో కొంచెము వైన్ తెమ్మని చెప్పు.

పావ్లిన్: ఈగర్! నువ్వు తాగకూడదని తెలుసునుకదూ?

ఈగర్: నాకు తాగుడు చాలా అవసరం.

పావ్లిన్: ప్రతిదీ వాంఛించడం మీకు అంతమంచిది కాదు.

ఈగర్: ప్రతిదీ వాంఛించడం మంచిపని కాదు - ప్రతిదీ చూడటంకూడ మంచిపనికాదు. అదే నాతో వున్న సంగతి. నాకు మహా సులభంగా కనపడుతోంది ప్రతి విషయమూను. (పావ్లిన్ జీవియావెంట వెళ్తాడు.)

బాష్కిన్: (లోపలికివస్తూ) మీకెట్లా వుందండీ ఈగర్‌గారూ?

ఈగర్: గతించిన కాలమే మంచిది. అయితే యాకౌ అరెస్టయినాడంటావా?

బాష్కిన్: అవును. నా కృతన్ని పట్టుకపోయి అంతా అరగంటలోపే అయింది. ఈవేళ రాత్రి రైలుమీద

మాస్కో తీసికెడకారట.

ఈగర్: ఇంతకూ అసలు కారణం ఏమిటి?

బాష్కిన్: వాళ్ళు పదిమంది ఉన్నారట. రాజద్రోహ సంబంధమైన కుట్ర చేస్తున్నారట.

ఈగర్: గవర్నమెంటును కూలద్రోయడానికి కుట్రా? ప్రతివాడూ చేస్తున్న పనే అది. వాళ్ళకేం కావాలిట?

బాష్కిన్: కొందరికి ఊరికే జారును పడగొట్టడమే వుద్దేశ్యం. కార్మిక - కర్షకులే దేశాన్ని పరిపాలించాలని మరి కొందరి అభిప్రాయం.

ఈగర్: కార్మికులా? వాళ్ళ చేతుల్లో పడితే రాజ్యం ఏమౌతుందట? దేశం ఏలవలసింది వర్తకులే. వర్తకుల సహాయం లేకుండా ఏమౌతుంది?

బాష్కిన్: అదీ సంగతి. ఈగర్! మీరు దోస్టుగేఫ్ లేకపోతే అసలేమీ నడవదు.

ఈగర్: జారును పడగొయ్యడం, ప్రజా పరిపాలన వాళ్ళకి కావాలి, నీకేం కావాలి?

బాష్కిన్: నాకేం కావాలి? అః! ఏమీ అవసరంలేదు.

ఈగర్: అయితే నువ్విక్కడి కెందుకు వచ్చావు?

బాష్కిన్: నేనా? ఇప్పుడు యీగా స్థానంలో ఎవరినుంచాలా అని అడగటానికి వచ్చాను. నేను మోక్రొజిఫ్‌ని సూచిద్దామనుకుంటున్నాను.

ఈగర్: అతడు తన ఉద్యోగం ఎందుకు వదలిపెట్టుకుంటాడు?

బాష్కిన్: ఈ రోజుల్లో పోలీసు పని చేయటం చాలాఅపాయం. అత నా వుద్యోగాన్ని వదిలేద్దా మనుకుంటున్నాడు.

ఈగర్: అయితే మంచిదే. ఉదయం యిక్కడికి పంపించు. నీ విప్పుడిక వెళ్ళొచ్చు. (గ్లాషా వస్తుంది. బాష్కిన్ వెళ్తాడు.)

గ్లాషా! బాకావాడు వచ్చినట్లేనా?

గ్లాషా: అతడు వంటింటిలో వున్నాడు.

ఈగర్: మంచిది లోపలకి తీసుకురా. కొంచెం వైన్ కూడా తీసుకురా.

గ్లాషా: ఈగర్! మీరు త్రాగకూడదు. మీ రెంతమాత్రం త్రాగకూడదు. మీరు త్వరగా బాగుపడాలి. వాళ్ళందరి తోను అదేపనిగా మాట్లాడకండి. లోపలికొచ్చేసె య్యండి. వాళ్ళందరూ మిమ్మల్ని అదోలాగుచూస్తారు. ఎక్కడికైనా నాతోటి వచ్చేసెయ్యండి. నేనక్కడ మీకు శుశ్రూషచేసి తిరిగి మీకారోగ్యం చేకూరుస్తాను.

ఈగర్: ఆగు, గ్లాషా! నాకు ఉద్రేకం రేపకు. నేనంటే నీకు ప్రేమని నాకు తెలుసు. నీవు, షూరా కూడా అంతే. మిగతావాళ్ళంతా ప్రతి నిమిషం నాకు విషం పెట్టడా నికి చూస్తున్నారు. అయితే కానీ చూస్తాను. ఏమైనా సరే నేను తిరిగి ఆరోగ్యం సంపాదించుకుంటాను. ఇకపోయి ఆ బాకావాణ్ణి తీసుకురా. (గ్లాషాపోతుంది, బులిషాఫ్ తనంతట తానే వైన్ తెచ్చుకుంటాడు.

గ్లాసులో పోసుకొని గబగబా త్రాగుతాడు. బాకావాడు వస్తాడు. అతడు హాస్యగానిలాగా వుంటాడు. సన్నగా పింతగా వుంటాడు. భుజాన సంచిలో బాకా వ్రేలాడు తూంటుంది.)

బాకావాడు: శుభోజ్జయమ్. ఆరోగ్యాభివృద్ధిరస్తు.

ఈగర్: ఆరోగ్యాభివృద్ధిరస్తు! అట్లాకోరతావన్నమాట నువ్వు?

బాకావాడు: అవును. అదే నేను కోరేది.

ఈగర్: అంత తొందరగా చెప్పేస్తే నమ్మకం కలిగేదెలాగా! సరే, నీ చికిత్సకి షరతులేమిటి?

బాకావాడు: అబ్బే, నా చికిత్స చాలా సులువైంది. కాని, యీ ప్రజలున్నారే, డాక్టర్లదగ్గరి మందునీళ్ళకి మోసపోయి మామీద నమ్మకం ఉంచరు. మా చికిత్స మొదలు పెట్టడానికి ముందే చేతిలో డబ్బు పడాలి.

ఈగర్: అలాగేలే. నీ చేతిలో డబ్బు తప్పకుండా పడుతుంది. సరేగాని. నిజంగానువ్వెవరికైనా రోగాలు కుదిర్చావా?

బాకావాడు: వందలమందికి నయంచేశానండీ!

ఈగర్: మరి నువ్వు దానివల్ల అట్టే సంపాదించినట్టు లేదే?

బాకావాడు: సత్కార్యాలవల్ల ఎప్పుడూ డబ్బు పోగుచెయ్యలేరు.

ఈగర్: అలాగని నువ్వనుకుంటున్నావు, అంతేనా? నువ్వే యే రోగాలు నయంచేస్తావు?

బాకావాడు: అన్ని రోగాలకి ఒకటే కారణం. కడుపులో విష వాయువువల్లే ఏదివచ్చినా. అంచేత నేను కువర్చలేని

రోగమే లేదు.

ఈగర్: అయితే బాగానేవుంది. నేనిప్పు డావిచిత్రమైన బాకాను చూడొచ్చా?

బాకావాడు: ఒక నాణెం యిస్తే సరి.

ఈగర్: ఒక నాణెమా? అయితే ఇదిగో నాణెం, నువ్వు ఒక్క సారే దోచెయ్యటం మొదలు పెట్టలా, అదొక సుగుణమే.

బాకావాడు: అది మొదలు పెట్టటానికే. (బాకా పైకి తీస్తాడు. ఘూరా వస్తుంది.)

ఈగర్: ఘూరా! నా కొత్త వైద్యుణ్ణి చూశావా? ఊఁ మంచిది. ఊదు బాకా. ఊదవోయ్. (బాకా వాడు దగ్గి మెల్లిగా బాకా ఊదుతాడు. మళ్లీ దగ్గి గట్టిగా ఊత్తాడు.) ఇంతేనా?

బాకావాడు: రోజుకు నాలుగు సార్లు అయిదేసి నిమిషాలు ఊదురా. అంతే, చికిత్స పూర్తయినట్లే.

ఈగర్: చాలా సులువే!

బాకావాడు: నేను వందలకొద్దీ జనానికి నయం చేశాను.

ఈగర్: నువ్వెవరివో నాతో నిజం చెప్పు. మూర్ఖుడివా? టక్కరివా?

బాకావాడు: (నిట్టూర్పుతో) మీరుకూడా నన్ను నమ్మరన్నమాట.

ఈగర్: నీమీదనా నమ్మకం! కాని, బాకా మానెయ్యకు. నువ్వు మూర్ఖుడివా? లేక మోసగాడివా? నువ్వు నిజం చెపితే

చాలా డబ్బిస్తాను, నాతో చెప్పు.

మూరా: వాణ్ణి బాధ పెట్టకండి, బాబయ్యగారు!

ఈగర్: నే ననే దదే. నీ పేరేమిటి?

బాకావాడు: గేబ్రిల్ యువాకోఫ్.

ఈగర్: గేబ్రిల్? నిజం చెప్పటం. ఉత్తమం. ఏమంటావు గేబ్రిల్?

బాకావాడు: అది చెప్పటం సులువే. ఎవరూ దాన్ని తప్పనలా యింతవరకు.

ఈగర్: ఊం, బాగుంది. నీ కెంత కావాలో ముందు చెప్పి నా ప్రశ్నలకు జవాబులు చెప్పు.

బాకావాడు: పదహారు నాణా లిస్తారా?

ఈగర్: ఇదిగో పర్సు. మూరా! అతనికి డబ్బు లెక్కపెట్టి ఇయ్యి. పదహారేంటి గేబ్రిల్?

బాకావాడు: నాది పొరపాటే. నే నింకా ఎక్కువ అడిగి ఉండాల్సింది.

ఈగర్: అయితే నువ్వు మోసగాడివే.

బాకావాడు: ఒక విధంగా అంతేలెండి. కాని, పూర్తిగా కాదు. ప్రతి విషయంలోనూ ఒక రకమైన మోసం ఉందని మీ కందరికీ తెలుసు.

ఈగర్: అతనికి డబ్బిచ్చేయి మూరా!

మూరా: మోసం చేయటానికి నీకు సిగ్గులేదూ?

బాకావాడు: మీకు నమ్మకం కుదిరితే అది మోసం అనిపించు

కోదు.

ఈగర్: ఆ మాట కూడా నిజమేలే. ఫాదిరీ పాప్లిన్‌కు యీ మాత్రం తలకాయ లేదు చెప్పడానికి.

బాకావాడు: మీకు నిజం చెప్పాలంటే యీ బాకా కొంతమందికి ఉపకరించింది. నా మాట నమ్మొచ్చు అంతమట్టుకు.

ఈగర్: మంచిది. (షూరాతో) అతనికి యిర్వై అయి దియ్యి

బాకావాడు: (సిగ్గుగా) చాలా నమస్కారాలు. (పిరిగ్గా) అయితే కావచ్చు. మీరు బాకా చికిత్స చేయించుకుంటారా? ఇ దెల్లా పని చేస్తుందో దేవుడికే తెలియాలి. కావి కొన్ని సార్లు మాత్రం పనిచేస్తుంది.

ఈగర్: వద్దు; వద్దు గేబ్రిల్! ఒకసారి ఊదు వినాలి. నీ శక్తి కొద్దీ ఊదెయ్యి. మేము వింటాము. (బాకావాడు ఊపిరి బిగించి చెవులు గళ్లు పడేటట్టు ఊత్తాడు. షూరా చేతులతో చెవులు కప్పుకొని నవ్వుతుంది. దోస్టుగేఫ్, స్వాంట్లాప్, జీనియా, వర్వరా, బాష్కిన్ తొందరగా వస్తారు.

వర్వరా: అ దేమి టండీ నాన్నగారూ?

జీనియా: ఈగర్! ఏమి టీ పని?

స్వాంట్లాఫ్: (బాకావానితో) బాగా తాగి వచ్చావా?

ఈగర్: అతణ్ణి ముట్టుకోకు. అతణ్ణి ముట్టుకోటాకి ధైర్యమే! గేబ్రిల్! అందరి చెవులు గళ్లు పడిపోయేలాగా ఊ దేయి! వాడు గేబ్రీలు మా గేబ్రీల్!

స్వాంట్జాఫ్: వాడి కేదో ముంచు కొచ్చింది.

వర్వరా: మీకు వినపడటంలా! మీకే: పిచ్చా!

ఈగర్: కానీ గేబ్రిల్? అది వాళ్ళ కిచ్చేయి ఊదు గేబ్రిల్! గట్టిగా ఊదు, ప్రపంచానికి ప్రళయం!

[తెర]

## మూ డో రం గం.

[రెంలో రంగస్థలమే. సాయంత్రం ప్రతి వస్తువూ యధా స్థలం లోంచి కదపబడుతుంది. టేబిలుమీద ప్లేటు ఉంటుంది. పేకేజీలు, సీసాలు ఎక్కడ పడితే అక్కడ ఉంటై. ఒక మూల సామా నుంటుంది. మెలీనియా శిష్యురాలు లైసియా ఒక సూట్‌కేసు తెరుస్తుంది. చేతిలో ట్రే తో గ్లాషా ఒక ప్రక్కన నిలబడి ఉంటుంది. టేబిల్ మీద దీపం వెలుగు తూంటుంది.]

గ్లాషా: మెలీనియా అమ్మగా రిక్కడ చాలా కాలం వుంటారా?

లైసియా: నాకు తెలియదు.

గ్లాషా: నీ వయ స్సెంత?

లైసియా: పందొమ్మిది.

స్వాంట్జాఫ్: (క్రిందికి వస్తూ) పందొమ్మిదీ! నువ్వలా సిగ్గు పడతావేం?

లైసియా: మేము మగాళ్ళతో మాటలాడకూడదు.

స్వాంట్జాఫ్: మీ అమ్మగారు టీ తీసుకున్నారా?

గ్లాషా: ఇంకా లేదు.

స్వాంట్జాఫ్: నువ్వు కొంచెం సిద్ధము చేసి పెట్టు. ప్రయాణం మూలాన్ని ఆవిడకి అవసరమవుతుంది. (గ్లాషా వెళ్తుంది.) ఏం జరిగింది? సిపాయిలు భయ పెట్టా రా? నిన్ను?

ప్రైసియా: ఊఁ.

స్వాంట్జాఫ్: ఏం జరిగిందో చెప్పవూ?

ప్రైసియా: అలాగేనండీ వా ళ్ళొక ఆవును చంపి, కాన్వెంటుకి నిప్పు ముట్టించటానికి ప్రయత్నించారు. (వర్వరా వస్తుంది.) క్షమించండి. (ప్రైసియా వెళ్ళిపోతుంది.)

వర్వరా: ఏమిటి, ఆమె శిష్యురాలితో బాతాఖానీ కొడుతున్నారు?

స్వాంట్జాఫ్: మెరీనియా యీ యిలట్లో ఉండటం నాకు బాగా బాగా లేదు.

వర్వరా: ఇది యింకా మన యిల్లు కాదే. టయాటిన్ ఏం చెప్పాడు.

స్వాంట్జాఫ్: టియాటిన్ ఒక మూర్ఖుడైనా కావాలి. లేకపోతే అలా నటిస్తూ అయినా ఉండాలి.

వర్వరా: (అలకించి) నాన్నగారి మూలుగేనా అది?

స్వాంట్జాఫ్: బాకా ఊదిన తరవాత ఆయన మెదడు సరిగా లేదని ఆ డాక్టరు వెధవలని ధృవపరచమంటే వాళ్ళు వొప్పు కోలా. గ్లాషా కేమైనా విల్లులో రాస్తే, మళ్ళీ చచ్చి నంత పనవుతుంది.

వర్వరా: మెలీనియా చూచుకుంటుందిలే ఆ పని. షూరా టయాటిన్‌తో బాగానే కలుస్తుంది.

స్వాంట్జాఫ్: ఆ మాత్రానికే ఏమయినట్టు. మీ నాన్నలాగే ఆవిడ జిత్తులమారి.

వర్వరా: నేను ఎప్పుడూ మీకు షూరా అంటే చాలా యిష్ట మనుకునే దాన్ని. ఆవిడతో బాగా కలిసి తిరిగే వారే మీరు?

స్వాంట్జాఫ్: షూరా నాతో కలిసి తిరిగేది నీ కపకారం చెయ్యాలనే

వర్వరా: అంచేత నువ్వు తలక్రిందు లయిపోయావు. ఇదిగో మళ్ళీ పావ్లిన్ మెల్లిగా యింట్లోకి వెడుతున్నాడు. చర్చి సేవకులు యింటిని ముట్టడి వేశారు. (పావ్లిన్ ఎలయిజవేటాతో వస్తాడు.)

పావ్లిన్: పేపర్లనిండా పచ్చి అబద్ధాలే. అందులో కొత్తేముంది. గుడ్ యీవినింగ్!

ఎలయిజవేటా: నేను నమ్మను. ఆయనేం చెపుతున్నారో వింటున్నారా?

పావ్లిన్: దాన్నిగురించి ఏమీ సందేహం లేదు. సింహాసనం వదిలేయమని జారుని బలవంతం చేసినమాటవాస్తవం పెంటుపీటర్సుబర్గుకి వెళుతూంటే సామ్యవాదులు కొందరు, వారిలో ఆపేశారు.

స్వాంట్జాఫ్: ఊ, అయితే ఏమిటంట?

ఎలయిజవేటా: పాదిరీ పావ్లిన్ విప్లవం ఒప్పుకోడు. యుద్ధం

చేయాలంటాడు. యుద్ధంతో విసిగిపోయాను నేను, అదే కాకుండా నాకు పారిస్ వెళ్ళాలని ఉంది.

పాల్లిన్: ఏమయినా సరే, మనం చేయ దలచుకొన్నది మన కుపకరించదు. అసలు సంగతి మన చేతులు దాటి పోయింది.

వర్వరా: ఫాదిరీగారూ! నిజానికి చర్చివారు రక్తపాతా న్నాపే పక్ష న్నుండాలి,

పాల్లిన్: ఇప్పుడు నాకు యీ వాదాలతో పని లేదు. నే నిక్కడికి ఈగర్ సంగతి తెలుసుకోటానికి వచ్చాను.

వర్వరా: మార్పు చాలా స్వల్పం.

పాల్లిన్: ఇంకా............? (తల గోక్కుంటాడు.)

స్వాంట్జాఫ్: డాక్టర్లు ఏమంత పెద్దగా చెప్పలా.

పాల్లిన్: మంచిది. ఆహా! డాక్టర్లు ఫీజుకోసం తంటాలు పడినా నేను యిదివరకే గ్రహించి వుండవలసింది.

స్వాంట్జాఫ్: ఖైదీలను వదిలేశారట.

పాల్లిన్: ఔనౌను, అదే ఆశ్చర్యం! ఇక నేం జరుగుతుం దంటారు మీరు?

స్వాంట్జాఫ్; సామ్యవాద సంఘాలు వెంటనే నిర్మింపబడి అన్నిటినీ సరి చేస్తాయి. సామ్యవాద పరిపాలనలో వ్యాపార నిపుణులు........

బాష్కిన్: (లోనికి వస్తూ) మొర్క్రొజఫ్ యిక్కడే వున్నాడు.

స్వాంట్జాఫ్: అతని కేం కావాలి?

బాష్కిన్: పోలీసు పని చేయడం అపాయమని ఉద్యోగం వదలు కున్నాడు. అతను మనకోసం అడవులలో పని చేస్తా డట.

స్వాంట్జాఫ్: అయితే మీరు పెట్టుకుంటున్నారా అతన్ని?

బాష్కిన్: మన కింకో మనిషి కావాలి. లాప్టేవ్‌ని నమ్మడానికి వీల్లేదు. దోనాట్ అతి నమ్మకస్తుడు. న్యాయాన్యాయ సంశయాలతో ఎక్కువ శంక పెట్టుకోని మనుష్యు లే మన కిప్పుడు కావాలి.

స్వాంట్జాఫ్: మనం న్యాయంకోసం, సత్యంకోసం పోరాడ వలసి ఉంది.

బాష్కిన్: నువ్వు మోక్రౌజఫ్ ఉద్యోగానికి ఒప్పుకోవడం మం చిది. ఈగర్‌తో యిదివరకే మాటలాడేను.

స్వాంట్జాఫ్: (భుజా లెగరేస్తూ పయటకి వెళ్తాడు.)

వర్వరా: నాన్న ఏం చెప్పాడు?

బాష్కిన్: ఈవాళ పంపించమని చెప్పాడు. అత డిక్కడే ఉన్నాడు. నీ భర్తతో అతనికి పరిచయం చేస్తానని చెప్పాను. నీవైనా అతణ్ణి చూస్తావా?

వర్వరా: లోపలికి తీసుకురా. (బాష్కిన్ వెళ్తాడు. వర్వరా నోటు బుక్కులో ఏదో వ్రాసుకుంటుంది, బాష్కిన్ మోక్రౌజఫ్‌తో వస్తాడు, అతని ముఖం గుండ్రంగా ఉంటుంది. కనుబొమ్మలు ఆశ్చర్యాన్ని సూచిస్తయి.

ఇంకా పోలీసు వేషంలోనే వుంటాడు. రివాల్వరు ప్రక్కన వేలాడుతూంటుంది. సలాం చేయటానికి కాళ్ళతో చప్పుడు చేస్తారు.)

మోక్రాజఫ్: తమరు చిత్తగించి నన్ను తమ సేవలో పెట్టుకొంటే చాలా కృతజ్ఞుణ్ణి.

వర్వరా: నిన్ను కలుసుకోవటం నాకు చాలా సంతోషం. ఇంకా నువ్వు యూనిఫారం లోనే వున్నావు. నీవు ఉద్యోగం విరమించావనుకుంటాను, అవునా?

మోక్రాజఫ్: నిజమే. పోలీసు దుస్తులతో వీధిలో కనపడటం అపాయమే. అందువల్ల నేను ఓవరుకోటు తొడుక్కుంటాను. రివాల్వ రెప్పుడూ కూడానే ఉంచుకుంటున్నాను. మూక శాంతించినా ఎప్పుడూ సిద్ధంగా ఉండటం మనకే మంచిది.

వర్వరా: కొత్త ఉద్యోగాని కెప్పుడు సిద్ధపడతావు?

మోక్రాజఫ్: ఈ క్షణం. నే నిదివరకటినుంచీ ఆలోచిస్తున్నాను. అడవికి వెళ్ళడానికి రేపే సిద్ధం.

వర్వరా: ఈ చొమ్మి యింకా చాలాకాలం ఉంటుం దనుకుంటున్నావా?

మోక్రాజఫ్: వేసవికాలం ఆఖరు వరకు ఉంటుందనే అనుకుంటున్నాను. చలికాలం వచ్చిందీ అంటే రకం మారాలి.

వర్వరా: విప్లవం ఋతువు మీద ఆధారపడి ఉంటుందని నాకు తెలియదు.

మోక్రొజవ్: మీ రేమీ అనుకోకపోతే మీ రక్కడే పొర పాటు పడుతున్నా రంటాను. వేసవికాలంలో అల్లరి చేస్తూ వీథులలో తిరగటం కంటె సంతోషం ఏమీ లేదు. మంచు కురవటం మొదలెట్టిందా అన్నీ మారుతవి.

వర్వారా: నీవు సర్వమూ మన మేలు కొరకే అనే సిద్ధాంతం గల వాడివి.

మోక్రొజవ్: పోలీసులంతా అంతే. పోలీసు లేమిటి, సిపాయిలూను. లేకపోతే జీవితమే దుర్భరం వాళ్ళకి.

వర్వారా: నీవు సైన్యంలో కూడా వున్నావా?

మోక్రొజవ్: రిజర్వులో నేనొక సార్జెంటుని.

వర్వారా: (చేతి సందిస్తూ) మంచిది. గుడ్‌బై. రాజంటే నీ విష్టపడతా ననుకుంటాను.

మోక్రొజవ్: (చేతికి ముద్దిడుతూ) తమ ఆజ్ఞ. (వెళ్తాడు.)

వర్వారా: వీడు మూర్ఖుడులా ఉన్నాడు.

బాష్కిన్: ఎంత మూర్ఖుడైతే అంతమంచిది. ఈ రోజుల్లో తెలివైన వాళ్ళ సంఖ్య ఎక్కువ. వాళ్ల చేసే పని కనబడు తూనే వుందిగా. దేశాన్ని కల్లోలమయం చేస్తున్నారు.

పాల్లిన్: (ఎలియజవేటాతో) చర్చి సేవకులకి వాక్స్వాతంత్ర్యం యిస్తేగాని వాళ్ళేమీ చేయలేరు. (గ్లాషా. మూరా ఈగర్‌ని తీసుకువస్తారు.)

ఈగర్: ఏమిటి? ప్రతివాళ్ళూ యిలా తేరిపార చూస్తున్నారు నా

వంక, ఇదివరకు ఎన్నడూ మీరు నన్ను చూడనట్టు?

పాల్లిన్: మీ రిక్కడికి రావడం మా కాశ్చర్యం వేసింది.

ఈగర్: అయితే నేను పోయా ననుకుంటున్నారా? ఇహ్! నేను చావను. యాకౌ ఖై దివతలే ఉన్నాడన్నమాట.

డాష్కిన్: అవును. ఖైదీ లందరిని వదిలేశారు.

స్వాంట్లాఫ్: అంతఘ రాజకీయ ఖై దీలనూను.

ఈగర్: యాకౌకి మంచి రోజులు పట్టినై. జార్ కి అంత్యం కాలం ప్రాప్తమయింది. మీ రేమంటారు ఫాదరీ?

పాల్లిన్: నేను? నే నెవరిని ఈ సంగతులు విచారించడానికి. ప్రజలు తరువాత చేసే పనేమిటి?

ఈగర్: కొత్త జార్ నెన్నుకుంటారు. ఏదో ఒక రకమైన జారు లేకుండా ఉంటే వారం రోజుల్లోనే వీళ్ల పీకెలు కోసుకుంటారు.

పాల్లిన్: మీ రిప్పుడు సరిగ్గానే ఉన్నారు. మీ రోగం వదలిపో తుంది చివరకి.

ఈగర్: చివరకి! పాల్లిన్! మనం మాట్లాడుకోవలసింది చాలా ఉంది. బోలెడన్ని సంగతులు. (ఇతరులు పోతారు.) షూరా! వెళ్ళకు. రా, యిక్కడ కూర్చో.

షూరా: మీరు పడుకోవాలి.

ఈగర్; కుమారుడు ఫాదిరీ! మీరు కొత్త చర్చిని గురించి, విచిత్రమైన గంటలను గురించి, మాటలాడటానికి వచ్చారు. నేను మూర్ఖంగా ద బ్బిచ్చినట్టయితే కొన

దలచుకున్నారు కూడా.

పాల్లిన్: ఎంతమాత్రం కాదు. మీ రెట్లాఉన్నారో చూద్దామని వచ్చాను. కాని పూర్వం మీరుచేసిన దాన - ధర్మాలు తలచుకొంటే........

ఈగర్: పూర్వపు రోజులు పోయినై. నా కోసం ప్రార్థిస్తా నన్నారు మీరు. అది నా కేమీ ఉపకరించలేదు. నేను జబ్బుగా ఉన్నానని నాకు తెలుసు. మీరు మీ మాటలతో నన్ను మూర్ఖుణ్ని చేద్దా మనుకోకండి.

పాల్లిన్: క్షమించండి ఈగర్!

ఈగర్: మీ దైవానికి సిగ్గు లేదూ? నా డబ్బు తీసికొని నేను చస్తూంటే చూస్తూ ఊరుకోవటానికి?

పాల్లిన్: మీరు అట్లా మాట్లాడకూడదు.

ఈగర్: ఎందుకు మాటలాడకూడదు? నాకు చావంటే భయం లేదు. కాని, నాకు, చావు అందరకీ యెలా వస్తుందో తెలుసుకోవాలనుంది.

పాల్లిన్: పరిపూర్ణ జీవితం లోనికి ప్రాణి గొరటానికి మృత్యు వొక సోపానం.

ఈగర్: నాకు పరిపూర్ణ జీవితం అక్కర్లేదు. నేను యీభూమి మీద నివసిస్తే చాలు.

పాల్లిన్: మీ జబ్బే మిమ్మ ల్నిట్లా మాటలాడిస్తూంది. నేను పోవాలి. దైవ సేవకుడు ఇలాంటి మాటలు వినడు. (వెళ్తాడు.)

ఈగర్: ఘూరా! యితడు అసహ్యకరమైన దగాకోరు. నువ్వు పెద్దదాన వయినాక నేను చేసిన తప్పులు మరి చేయ కూడదు.

ఘూరా: మీరిక పడుకోవాలి.

ఈగర్: బాకావాడు వచ్చినతరవాత నాకు మతి సరిగా లేదని గందరగోళం చెయ్యటం మొదలు పెట్టేరు వీళ్లు. డాక్టర్లు వాళ్ళని అణిచేశారు. ఘూరా! నాకు మతి పోలే దని నీకు తెలుసా?

ఘూరా: ఆఁ. పూర్తిగా తెలుసును.

ఈగర్: అది నిజం. నేను మునుప టంత బాగా ఆలోచించ లేను. కాని మనిషి జీవితంలో వున్నప్పుడే చావు బ్రతుకుల అర్థం తెలుసుకోవాలని కుతూహల పడ తాడు.

ఘూరా: మీ రట్లా మాటలాడితే నే నొక్క నిమిష ముండ నిక్కడ. మీకు తప్పకుండా నయమౌతుంది. గ్లాషా సరిగ్గానే చెప్పింది మీ రీ యిల్లు వదలి పెట్టి ఎక్కడి కన్నా వెళ్ళాలని. మీరు మాట వింటేనా?

ఈగర్: మాట వింటేనా! ప్రతివాళ్ళ మాటలు వినడం తప్ప నేను చేసేదేమీ లేదు. ప్రతి ప్రయత్నం చేస్తున్నాను. సోఫ్యానా యీ సాయంత్ర మిక్కడికి వస్తుంది. ఆవిడ వల్ల యేమైనా అవుతుందేమో చూద్దాం.

షూరా: అయితే బాగానే ఉంది. మీరు నాకోసమైనా ఒక్క క్షణం పడుకోండి నాన్నా!

ఈగర్: పడుకున్నప్పు డసలే బాగుంటం లేదు. నీవు పడుకొంటే నీవు లోబడినట్లే. నాకు మాట్లాడాలని ఉంది. చాలా విషయాలు చిన్నప్పటినుంచీ నీతో మాటలాడ లేదూ? నీకు జ్ఞాపకం లేదూ నీకు కథ లెట్లా చెప్పే వాణ్ణో:

షూరా: ఉంది.

ఈగర్: ఆ కథ లన్నీ నిజమే. నే నెప్పుడూ నిజమైన కథలే చెప్పేవాణ్ణి. అంతే, నేను బ్రతికిం దంతా అంతే. నే నర్థం చెసికొన్నదీ అంతే. మత గురువులూ, రాజకీయ వేత్తలూ, వా ళ్ళందరికీ నాకూ సంబంధ మేమిటి? వాళ్ళ నా కెందుకు కావాలి? దేవునిలో నమ్మకం లేదు నాకు. ఎందుకు నమ్మాలి? మనిషిని, మనిషి శక్తిని నమ్ముతాను నేను. ఇప్పుడు కొద్దిమంది నిరాడంబర జీవులు ఎక్కడెక్కడో ఉండి ఒకళ్ళతో ఒకళ్ళు పోరాడుతున్నారు.

షూరా: ఈ విషయాలని గురించి మీరు చింత పడకూడదు.

ఈగర్: నీవు చెప్పింది నిజమే: నే నెందుకు చింతపడాలి?.... నూత్నంగా సృష్టించే రాజ్యం నాకోసం గాదు. కాని నీ సంగ తేమిటి? నీ వెట్లా బ్రతుకుతావో ఆ క్రొత్త సృష్టిలో!

షూరా: నన్నుగురించి ఏమీ చింతపడవద్దు మీరు. జీనియా (లోనికివస్తూ) షూరా! ఆంటోనియా, ఆమె సోదరుడు నిన్నుచూడటానికి వచ్చారు. అక్కడ ఉన్నారు.

షూరా: ఉండనీ.

జీనియా: మీ నాన్నగారితో నేను మాట్లాడాలి.

షూరా: బాగానేవుంది. అనవసరమైన సంగతు లన్నింటితోటీ ఆయన కేమీ చింత కలుగచేయకూడ దిప్పుడు.

జీనియా: అవును. నేను చేయదగిన దేమిటో, చేయకూడని దేమిటో నిర్ణయించి చెప్పటంకూడ మొదలెట్టావు. (షూరా పోవును) షూరా టయాటిన్‌తో తిరుగుతూం ది. మీకు తెలిసే వుంటుంది.

ఈగర్; అయితే ఏం?

జీనియా: అయితే ఏం! ఆవిడికి తగిన వరుడు కాడు. ఇదంతా స్వ్యాంట్జాఫ్ చేశాడు. ఒక దరిద్రుడికి మనం ఆశ్రయం యిస్తే అత డింటికంతా అధికారం చెలాయిస్తున్నాడు మనకేం దిక్కులేనట్టు.

ఈగర్: ఇంకా యేమైనా చెప్పాలా?

జీనియా: ఆఁ. ఇంకా ఉంది. మెలీనియా యిక్కడే వుంది.

ఈగర్: ఏం కావాలి, ఆవిడకి?

జీనియా: ఆవి దిప్పు డవస్థలో ఉంది. అల్లరి మూక కొందరు కాన్వెంటులో అల్లరి చేస్తున్నారు. ఇదంతా దోనాట్ చేసిన పనే. అత డింకా హుంషారిస్తున్నాడు వాళ్ళకి.

ఈగర్: మెలీనియా కష్టాలతో నా కవసరం లేదు.

జీనియా: ఈగర్! మీరు మెలీనియాతో ఎందు కనకూడదు?

ఈగర్: ఏందు కనకూడదా? - ఎందుకనాలి?

జీనియా: ఆవి దెపరు? నా తోబుట్టువేగా.

ఈగర్: అయితే ఏమిటో నాకు తెలియటం లేదు. నీవు కావా లంటే తప్పకుండా ఆవిడిని చూస్తాను.

జీనియా: ఆవిడితో కొంచెం మృదువుగా మాట్లాడండి. మీరు జబ్బుమూలాన్ని యిలా చిరాకుగా ఉన్నారంటాను. (వెళ్తుంది.)

ఈగర్: చిరాకూ! (వర్వరా వస్తుంది.) అబద్దాలకోరు. వాళ్ళం దరూ ఒకటే మచ్చు.

వర్వరా: బాబయ్యగారూ! అమ్మ టియాటిన్‌నుగూర్చి మాట లాడుతూంటే విన్నాను.

ఈగర్: నీవు విన్నావూ? ప్రతీదీ వింటావు. నీ కసలు వినటం కంటె వేరే పనిలేదు.

వర్వరా: టియాటిన్‌ను షూరా నెందుకు పెళ్ళి చేసుకో వద్దం టోంవో అమ్మ? అతడు మంచివాడు, శాంతమైనవాడు పైగా ఎక్కువ కట్నం అడగడు. ఈ సంబంధం నాకు బాగా నచ్చింది.

ఈగర్: బాగా నచ్చింది. చాల పరిపూర్ణ మైంది. ఇంతకంటె మంచిది కుదరదు. పైగా అతడు నీ ప్రియమైన భర్త తాలూకు వాడూ. షూరా కిచ్చిన డబ్బు టియాటిన్

నుంచి మీరు సునాయాసంగా తీసికోవచ్చు.

వర్వరా: నా కేం తెలియడం లేదు. మీరు చెప్పేది.

ఈగర్: ఇక వెళ్లు, మీ పెద్దమ్మతో మాటలాడాలి. (వర్వరా పోతుంది. మెలీనియా వస్తుంది.) అయితే మనం మన దెబ్బలాట మరచిపోవాలన్న మాట. ఇహ?

మెలీనియా: న న్నిలా అగౌరవంచేయటానికి ఏమీ కారణం కన పడదు.

ఈగర్: కారణం లేదూ? అది నీవు మరచిపోతావు. మా పా పాలు పోగొట్టు. మా యెడల అపకారం చేసినవాళ్ళని మేము క్షమిస్తాం.ఇంతకీ నీ కొచ్చిన అప దేమిటి?

మెలీనియా: ఇప్పు డేం జరుగుతుందో తెలుసుకోవాలని ఉంది. భగవంతుని ప్రతినిధి యైన జారుని పద భ్రష్టుణ్ణి చేశారు: తర్వాత వచ్చే దేమిటి? భగవంతుడు తన ప్రజలమీద కారు మేఘం కప్పేశాడు. వారు దైవ దూరులై అన్యాయ వర్తనులుగా ప్రవర్తిస్తున్నారు. వాళ్ళ గొయ్యి తమ కాళ్ళ కింద తామే తవ్వుకుంటు న్నారు.

ఈగర్: కొత్త స్వాతంత్ర్యోదయాన్ని గురించి యాకౌ నీకు చెప్పే వుంటాడు.

మెలీనియా: ఈ యాకౌలాంటి వాళ్ళే దీనికంతకు మూలం. గవ ర్నరును తలక్రిందులు చేసి ఉస్మోలోవిస్కీ అతని స్థానంఆక్రమించాడు.

ఈగర్: లేదా యేమిటి? ఒక నిరంకుశుడికి మరొక నిరంకుశుణ్ణి మార్చడం.

మెలీనియా: నిన్న బిషప్పుగారు మనం అంతా ఒక అగాధంలో ఉన్నా మన్నారు. ఇప్పుడు వీళ్ళంతా రాజకీయాలు సరిగ్గా నడుపుతారని ఎట్లా అనుకోవడం? అనాది నుంచీ శక్తి కలిగిన కత్తి, శిలువ యీ దేశాన్ని పాలిస్తున్నవి.

ఈగర్: సిలువ లేని కాలంలో కూడా రాజ్యాలు పరిపాలింప బడినట్టు యీ బిషప్పుకి తెలియాలి.

మెలీనియా: బిషప్పుకు వ్యతిరేకంగా ఏమీ చెప్పక్కర లేదు. జార్ పద భ్రష్టుడు కావటం మీకు చాలా సంతోష మనుకుంటాను. మిమ్మల్ని తప్పక బాధ పెడతారు.

ఈగర్: మనం తగవులాడ కూడదు. మిగతా విషయాలు తర వాత మాటలాడుకుందాము. సోర్యూనాతో మాట్లా డాలి. (పిలుస్తాడు.) జీనియా!

మెలీనియా: సోర్యూనా దెయ్యాలతో పనిబడి ఉంది. షైసియాను ప్రొపొతేజ్‌ను తీసుకు రమ్మని పంపిం చాను.

ఈగర్: ప్రొపొతేజ్ పిచ్చి వెధవ. వా డవసరం లేదు. వాడు నన్ను ఐడిపిస్తాడు. నేను నయం చేసుకోవాలి. (జీని యా వస్తుంది.) జీనియా! సోర్యూనా వచ్చిందా?

జీనియా: ఆవిడ వచ్చింది. అందరూ వెళ్ళితేగాని యిక్కడకు రాదు.

ఈగరు: మీ రందరు వెళ్ళండి, మీ యిద్దరు దయ చెయ్యండి. (జీనియా, మెలీనియాలు వెళతారు. కొంచెం నేపటి లో సోర్యూనా వస్తుంది. ఈగర్ పార్శ్వం రుద్దు కుంటాడు. మెల్లగా సోర్యూనా వస్తుంది. మాటలా డదు కాని, మంత్రకత్తెలాగ చేతులతో ఎన్నో వికా రాలు చేస్తుంది. గాలిలో కనపడని ఎన్నో వస్తువుల్ని తీసివేస్తున్నట్టు.

ఈగర్: ఏం చేస్తున్నావ్?

సోర్యూనా: దేవుని కుమారుడైన మానవుని శరీరమునందు భౌతి కముగా ఆవేశించిన ఓ భూతములారా! ఓ దుఃఖ ఫేవ సైన్యములారా! మిమ్ము యీ రోజున పటాపం చలు చేయుచున్నాను - తక్షణమే పటాపంచలు కండు. మీ కెట్లా ఉందండీ!

ఈగర్: నాకు జబ్బుగావుంది. మీరు భూతాలని పంపేశారా?

సోర్యూనా: నాకు భూతాలతో సంబంధం లేదు. దైవంతోనే.

ఈగర్: భూతాల్ని ఏమీ చేయలేకపోతే మీ రేమీ లాభం చేయ లేరు. మత గురువు లప్పుడే నాకోసం ప్రార్థించేరు దేవుణ్ణి.

సోర్యూనా: మీకు నాలో నమ్మకం లేదన్నమాట. నమ్మితేగాని నేను చేసే దేమీ లేదు.

ఈగర్: భూతం దగ్గరనుంచి వచ్చి వుంటే నేను నమ్మి యుం దును. నీవు నన్ను పూర్తిగా ఎరుగుదువు. కతినుణ్ణి.

మోహపాశబద్ధుణ్ని. దురాశాపరుణ్ణి. నేను మహా పాపిని. దేవుడు నన్ను త్రోసివేశాడు. మీకు భూతాలతో సంబంధం లేకపోతే మీ రిక్కడనుంచి దయ చెయ్యొచ్చు.

సోర్యానా: వాళ్లు నిన్నుగురించి చెప్పినదంతా నిజమే. నీవు ధనం యివ్వగలిగితే నేను సహాయం చెయ్యగలను.

ఈగర్: నే నివ్వగలను.

సోర్యానా: నొప్పి ఎక్కడ? చెప్పండి?

ఈగర్: ఇక్కడ.

సోర్యానా: ఒక రహస్యం దాచుతారా?

ఈగర్: మరేం భయంలేదు, నే నెవరికీ చెప్పను.

సోర్యానా: అయితే జాగ్రత్తగా వినండి. రెండు రకాల భూతా లున్నాయి. నల్ల భూతాలు, పచ్చ భూతాలు. నల్ల భూతాల్ని మత గురువు ప్రార్ధనవల్ల పోగొట్ట కలడు. కాని పచ్చ భూతాల్ని పంపించివేయడానికి ఒకే ఒక మార్గముంది.

ఈగర్: ఏమిటది?

సోర్యానా: దేయ్యాలరాజుతో నేను స్వయంగా మాట్లాడాలి?

ఈగర్: ఇది నన్ను నమ్మమంటావు, ఔనా?

సోర్యానా: దానికి చాల డబ్బవుతుంది.

ఈగర్: పో అవతలికి. తన్నులు తినకుండా బయటికి పో ముందు. మీ రందరూ నాకు పిచ్చెత్తిం దనుకున్నారా!

(ప్రక్క గదిలోనుండి గ్లాషా వస్తుంది.)

గ్లాషా: ఏం జరిగింది?

ఈగర్: దాన్ని బయటికి గెంటు.

గ్లాషా: నిన్నే. వెళ్ళమంటున్నారు. వినపడలా?

సోర్యూనా: సోర్యూనా కద్దొస్తున్నారు, జాగ్రత్త! తరువాత మీరు విచారపడతారు.

గ్లాషా: ఓసి మాయలమారీ! పో అవతలికి. (సోర్యూనా పోతుంది.)

ఈగర్: ఇస్.

గ్లాషా: ఏం జరిగిందండీ? (మెలీనియా జీనియాతో వస్తుంది.)

ఈగర్: మెలీనియా! దేవుడికి బాధ తెలుస్తుం దంటావా?

మెలీనియా: క్రీస్తు మనందరికోసం సిలువమీద బాధపడ్డాడు.

ఈగర్: ఆ స్త్రీ.........నా కిప్పు డేమీ బాగాలేదు. జీనియా! దాని కేదైనా ఇచ్చి పంపెయ్యి. నే నలసిపోయాను. మూర్ఖులు, దగాకోర్ల కంటే ఎక్కువ అలవగొట్టారు నన్ను. గ్లాషా! నా గదిలోనికి తీసికెళ్ల నువ్వు. (వాళ్లు పోతారు.)

మెలీనియా: ఇతడు తెలివిలోనే ఉన్నాడు మనిషి. పిచ్చిగా నటిస్తాడు.

జీనియా: అతడు యెత్తులమారి. మనం ఏం చెయ్యా లిప్పుడు?

మెలీనియా: నటించనీ; కోర్టుకు వెళ్ళితే అన్నీ తేలతయి. మనకే నయం. కావలసినంతమంది సాక్షులున్నారు. సోర్యూనా

పాదిరీ, పాల్లిన్ వీళ్ళందర్ని పిలువవచ్చు మనం. ఇంకా బాగానే వుంది వ్యాపారం పూరా ఒక రైతేకాస్తే మనంభయపడవలసింది. అతదేదైనా గ్లాషాకి వ్రాసిదు ఇతనికి పిచ్చెక్కిందని మనం రూఢిచేయాలి.

జీనియా: నాకేం చేయటానికీ తోచటం లేదు.

మెలీనియా: నేను చెపుతున్నాను విను. నీవు నా మాటే వింటే ఇదంతా జరిగే ఉండకపోను. నీవు హాయిగా బాష్కిన్ ను పెళ్ళి చేసికొని ఉందువు.

జీనియా: అది బాలాకాలం క్రిందటి మాట. అతదు ఎంతంద మైన మనిషి: అప్పుడు నీకు కూడ నామీద అసూయ కలిగింది.

మెలీనియా: నీమీద నాకెంమ కసూయ?

జీనియా: మనం పాత గాయాల్ని రేపుకుంటే లాభం లేదు. ప్రొపోతేవ్ సంగతేమిటి? ఈగర్ దగ్గరకు వాణ్ణి పంపటం మంచి దంటావా యిప్పుడు?

మెలీనియా: ఎందుకు కాదు? మనం ఎందుకు అర్ధాంతరంగా మన ప్లానుకు మార్చుకోవాలి? సిద్ధంచేసి తీసుకురా అతణ్ణి. (జీనియా వెళ్తుంది) ఛైసియా! (ఛైసియా వస్తుంది.) విశేషా లేమైనా తెలిసినవా?

ఛైసియా: లేదు. ఆమె ఏమీ చెప్పటం లేదు.

మెలీనియా: ఆ గయ్యాళేనా?

ఛైసియా: మీరు చెప్పిన ప్రశ్నలన్నీ అడిగాను. ఆవిడ తనకు

నచ్చిన, ఎవరినో తన కిష్టం వచ్చినప్పుడు ఎవరికీ చెప్పకుండా పెండ్లి చేసుకుంటుందట. అందర్నీ మోస గాళ్ళంటుం దావిడ. మనందరం వాళ్ళ నాయనకి పిచ్చి పట్టించాలని చూస్తున్నామట.

మెలీనియా: ఆమె ఆ సంగతి నీతో చెప్పిందా?

హైసియా: లేదు. ప్రొపొతేజ్‌తో.

మెలీనియా: అతడేం చేశాడు?

హైసియా: ఏమీ చేయలేదు. ఏవో పిచ్చి పిచ్చిగా మంత్రాలు చదివాడు.

మెలీనియా: పిచ్చి పిచ్చి మంత్రాలూ? అవే అతనికి భవిష్యత్తు తెలియజేసేది! అవతల గదిలోనికివెళ్ళి అక్కడుండు. (హైసియా వెళ్ళును. ప్రొపొతేజ్ జీనియాతో వస్తాడు. అతడు పొడుకోట్లు ధరిస్తాడు. అంగీ అతని చీల మండల నంటుతూ ఉంటుంది. మెడలో సిలువ, యింకా పిచ్చి బొమ్మలు ఉంటవి. పొడుగాటి జుట్టు, పలుచని పొడుగాటి గడ్డం. తొందర తొందరగా అదొక రకంగా నడుస్తాడు.)

ప్రొపొతేజ్: ఇవ్వరా పొగ? భూతం గాలికోసం కొట్టుకుంటుంది.

జీనియా: ఇక్కడేమి పొగలేదే! (ప్రొపొతేజ్ గాలి ననుకరిస్తూ యీల వేస్తాడు.)

మెలీనియా: అత డొచ్చేవరకు ఆగండి. (పిలుస్తుంది) ఈగర్! ఆ లంతెను ప:పివెయ్యాలి. జ్ఞాపకముంచుకోండి.

ఈగర్: (గ్లాషాతో వస్తూ) నా కింక విశ్రాంతి లేదూ? (ప్రొఫో తేజ్‌ను చూచి) ఇతణ్ణి తీసుకపొండి. నా కవసరం లే దికను.

ప్రొఫొతేజ్: భయ పడ కండు. భయ మెంచుకండి (యీల వేస్తాడు) గాలివేస్తుంది. నొప్పి తగ్గిపోతుంది. గ్రిగరో దెయ్యాన్ని పంపించేశాడు.

ఈగర్: ఇత డనే దేమిటి?

ప్రొఫొతేజ్: మనకు రక్షకుడైన జార్‌ని పదభ్రష్టుణ్ని చేశారు. గాలి వేస్తుంది. (ఈల) దుష్టుంయొక్క పరిపాలన - మృత్యువు పాలిస్తూంది. (ఈల) నీ ప్రక్కనుండే ఆ స్త్రీ (గ్లాషాకేసి చూపెడతాడు) ఆవిడ ముఖం ఘూత ముఖం. దాన్ని తక్షణం పంపెయ్యి. నీకు నయం కావాలంటే వెంటనే పంపెయ్యాలి.

ఈగర్: ఎవరు నీ కీ పాఠం నేర్పింది? మెలీనియాయేనా?

మెలీనియా: ఏమిటీ విడ్డూరం. నీవేమైనా చెప్పగలవేమో చెప్పు.

ఈగర్: ఎవరో ఒకరు నేర్పి ఉండాలి. మీరంతా నా మతి చెడ గొడు తున్నారు. షూరా! షూరా!

ప్రొఫోతేజ్: దాన్ని పంపెయ్యి. దాన్ని పంపేసెయ్యి. కోడి కూయును. గడియారం టిక్కు టిక్కు మనును. ఇతర మతస్థుల కంత్యకాలం వచ్చింది.

షూరా: (లోనికివస్తూ) ఏమిటీ నాటకం?

మెలీనియా: అతణ్ణి కదపకు.

ఘూరా: నాన్నగారూ! మరేం భయంలేదు.

మెలీనియా: మాట్లాడకు.

ప్రొఫోతేజ్: భేరీ మ్రోగును. మృత్యువు వస్తుంది. గుంపులు కూడుతున్నారు. ప నయిపోయింది. మనం కలిసి నృత్యం చేద్దాం. ( అతాడు నృత్యం చేస్తూ తొందరగా మాట్లాడును.) అస్టోరత్, సబాతన్, ఆశీపత్, ఆయిదూమే, న్యూమాల్, సాతాన్, భూత ముల రాజు అందరితో నృత్యం చేస్తాడు, గ్రిగర్! ఈగర్! గ్రిగర్, ఈగర్! పొగ! పొగ!! పొగ!!! ఈగర్! ఈగర్!! జాగ్రత్త మాయలమారి ముండ జాగ్రత్త! గ్రెగర్, ఈగర్! (నేల మీద కూర్చుం టాడు. ఈల ఊత్తూ కీచు గొంతుకతో అరు స్తాడు. టియాటిస్ వస్తాడు.)

ఘూరా: టియాటిస్! అతణ్ణి ఆపు.

టియాటిస్; సంగతేమిటి?

మెలీనియా: ఆయన్ని ముట్టుకో కూడదు. ఆయన సమాధిలో వున్నారు.

ఘూరా: అతని నోరు కట్టేయి. వాడు నాన్నని చంపేస్తున్నాడు. అదే వాణ్ణి తీసుకొచ్చింది యిక్కడికి.

టియాటిస్: రావయ్యా! గురూజీ! (మెడ పట్టుకొని గెంటుతాడు.)

మెలీనియా: నీ కెంత ధైర్యం ఆయనమీద చెయ్యేయ్యడానికి? ఆయన సమాధిలో వున్నారంటే వినపడదూ? (ఆమె వాళ్ళతో పోతుంది)

ఈగర్: మెలీనియా యీ నాటకం వేయించింది.

షూరా: శాంతంగా పడుకోండి. మీ కెట్లా వుంది?

ఈగర్: బ్రతికున్నవాడికే అంత్యక్రియలు జరుపుతున్నారు వీళ్లు.

షూరా: గ్లాషా! డాక్టరుకి కబురు పంపు.

ఈగర్: వద్దు, వద్దు. అతనికోసం కబురు పంపొద్దు. మీకు వినపడలా వా డేమి చెప్పాడో? భేరీ మ్రోగును. మృత్యువు వచ్చును. అది ఉ స్వంతమే చెప్పి ఉండ వచ్చును. గుంపులు కూడుతున్నారు. పనయిపోయింది.

వర్వరా: (లోనికి వస్తూ) ఒక పెద్ద ఉత్సవం వస్తూంది. ఆండ్రిజ్ ఏడీ? అతడు కూడ వీళ్ళల్లో జేరుతాడు. మనం అంతా ఒక చోటే ఉండాలి.

షూరా: మాట్లాడకు. నాన్నగారికి జబ్బుగా వుంది.

వర్వరా: త్వరలోనే నయమౌతుంది. ఆండ్రిజ్ ఏడీ? (కిటికీ దగ్గరకు వెళ్ళును.)

ఈగర్: గుంపులు కూడుతున్నారు. షూరా! గ్లాషో భారం నీదే సుమా!

షూరా: మీరు పడుకోండి. (ఆమె గ్లాషాతో మెల్లిగా చెప్పును. గ్లాషా వెళ్ళును.)

ఈగర్: భగవంతుడి పరిపాలన నాశనమౌతుంది. నా కేమీ కనపడటం లేదు. అంతా అయోమయం. నీ పాలన నశించి పోతుంది. నాకు చావు విధించిన నీవు ఏమి దేవుడివి? ఎందుకు? అందరూ చావాలి?

ఏం? వాళ్ళను చావనీ. ఘూరా! విను. పాడుతున్నారు. (వీధిలో కోలాహలం) నే నెందుకు చావాలి. ఏం? (గ్లాషాతో టయాటిన్ తిరిగివస్తాడు) గ్లాషా! నాదగ్గరే ఉండు. ఘూరా! డాక్టర్ (స్వాంట్లాఫ్ జీవియాతో వస్తాడు) మీరు శాపాలు పెడతారు. గ్లాషా! (పాటలు వినబడతయి. ఘూరా పరుగున వెళ్ళి కిటికీ తలుపులు తెలుస్తుంది.) ఏమిటది? నా అంత్యక్రియలు జరుగుతున్నాయా? ఘూరా! ఏమిటది? (కష్టంమీద లేస్తాడు)

ఘూరా: ఇట్లారా. యాకౌ నాయకత్వం వహించాడు చూడు! (పాట గట్టిగా వినపడుతుంది.)

ఈగర్: నాకు సహాయం చెయ్యండి గ్లాషా........ఘూరా.... నేను రాలేను. (పడిపోతాడు. బయట పాట చెవులు గళ్లు పడేటట్టు వినపడుతుంది. ఆ కిటికీ దగ్గరనుంచి ఆ ఉత్సవము జరిగిపోతుంది.)

[తెర]

సమాప్తము.



